# ఆండాళ్ళమ్మగారు






రచన:
శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మ

దామ్ర పబ్లికేషన్సు
విజయవాడ-2

# 1

శ్రీ శ్రీ పార్థసారథి ఆ సాయంత్రం ఆఫీసునుంచి దారిలో పువ్వులు కొనుక్కుని హుషారుగా ఈల వేసుకుంటూ ఇంటికొచ్చాడు. పద్మ [illegible] నెత్తుకొని చిరునవ్వుతో ఎదురు వచ్చింది. [illegible] భార్యామణి కందించి కొడుకునెత్తుకొని [illegible] కూర్చున్నాడు సారథి. పువ్వులు టేబుల్ మీద [illegible] భర్తగారి బూట్లు విప్పటంలో నిమగ్న[illegible] ఇంచుమించుగా అది ప్రతి సాయంత్రము జరిగే [illegible]. పద్మ సన్నటి వేళ్ళతో చురుగ్గా బూట్లు విప్పుతోంది. "నీ పతిభక్తికి మెచ్చితిని పద్మావతీ! ఏదైనా వరము [illegible]కొనుము" పతిదేవుడైన పార్థసారథి భార్యామణి సేవకు సంతోషించి, వరం ఇవ్వటానికి సంసిద్ధుడయ్యాడు.

"[illegible] ప్రభూ! ఉత్తుత్తి వరాలు రోజుకు [illegible], [illegible] ఇచ్చేస్తూంటే, ఏం చేసుకోను?" సవినయంగా, [illegible] తిరస్కరించింది పద్మావతి నవ్వుతూ.

సారథి [illegible] మన్నాడు "అయితే వద్దనేదవా?"

"వద్దు ప్రభూ! వద్దు వద్దు" నేసింది పద్మ!

"తరువాత చింతించెదవు బాలా! బాగుగా..."

"చాలుకాని—కాళ్ళు కడుక్కొని రద్దురూ! హోస్నాలకేం? పెంచినకొద్దీ పెరుగుతాయి." అంటూ బూట్లో టేటుల్ కిందకినెట్టి లేచింది పద్మ.

"అయ్యో! అంతకోపం అయితే ఎట్లా అమ్మాయ్!" అంటూ లేచి బాబును కుర్చీలో కూర్చోబెట్టి బట్టలు మార్చుకొని దొడ్లోకెళ్ళి కాళ్ళుకడుక్కొని, సారథి వచ్చేసరికి ఉపాహారం, మంచి నీళ్ళూ తయారుచేసింది పద్మ.

"ఓ! ఈ పూట టిఫెన్ చేశావా? ఏం పేరుపెట్టావ్?"

పద్మ నవ్వింది. సారథి బాబుని వొళ్ళోకూర్చోబెట్టుకుని టిఫెన్ కానిస్తూంటే, తను పువ్వులు గుచ్చుకుంటూ ప్రక్కన కూర్చుంది.

"ఇవ్వాళ పూలు తాజాగా వున్నాయి" అంది.

"అవును. ఇవ్వాళ పాలకాయలు కూడా..."

"నయం. అవి గవ్వలు"

"ఓహ్హో! వీటికి గవ్వలని పేరుపెట్టావా? భగవాన్! మా ఆవిడకేం నేర్పు ప్రసాదించావయ్యా! గవ్వలు పాలకాయల్లా—పాలకాయలు పకోడీల్లా—పకోడీలు పునుకులుగా—పునుకులు గవ్వల్లా—ఓహ్! ఏం చెప్పను! ఒక్కవంటని అనేక రకాల్లో, అనేక రకాలని ఒక్కవంటలో చేసి తినిపించగల భార్యామణిగల నేనెంత భాగ్యశాలిని!"

సారథి గబగబా అనేస్తూంటే పద్మ నవ్వింది. "ఎం సొద వెళ్ళబోసుకున్నా మీ భాగ్యానికేం కొదువలేదుగాని

గోరంతలు కొండంతలు చేసే మీవంటి భర్తకలిగిన నేను మాత్రం నిజంగా దురదృష్టవంతురాల్ని.”

సారథి అలిగాడు. సగంతిన్న గవ్వ పూర్తిగా నోట్లో పడేసుకొని, మరి తినటం ఆపేసి నోరుమూసుకున్నాడు.

“మీరు నన్ననగాలేంది, నేను తిరిగి అంటే అలగటం దేనికి ?”

“నువ్వు మంచి దానివీ, నేను అదృష్టవంతుణ్ణీ అన్నాను నేను; నువ్వేమో నేను మంచివాణ్ణి కానంటున్నావ్. అందుకే నువ్వు దురదృష్టవంతురాలి ననుకొంటున్నావ్. మరి అలగ సేమిటి ? నాకు గవ్వలూ వద్దు; పాలకాయలూవద్దు. అసలు అన్నమే వద్దు.”

“మంచినీళ్ళు !”

“వద్దు.”

“ఎన్నిరోజులవరకో చెప్పండి. నాకొక్కదానికే వంట చేసుకుంటాను.”

సారథి బిక్కమొహం వేసుకున్నాడు — “చూశావా ! మొగుణ్ణి కదా ? నేను అలిగితే నువ్వు చూస్తూ వూరు కుంటావా ?”

“మరేం చేసేది ?”

“బ్రతిమాలవూ ?”

“నాకు చేతకాదండి !”

“చూశావా ! అబద్ధాలాడుతున్నావ్ ! నీకు బ్రతి మాలటం వచ్చు. రాదంటున్నావ్ ! బ్రతిమాలవూ? తినమని

బ్రతిమాలవ్రా ! అన్నీ తినేస్తాను. గవ్వలు తినేస్తాను. అన్నం తినేస్తాను. మంచినీళ్ళు తినేస్తాను."

"మరెప్పుడూ యిలాంటి శపథాలు చెయ్యకుండా వుంటారా ?"

"ఉంటాను. చెయ్యకుండా వుంటాను. ఎప్పుడూ చెయ్యకుండా వుంటాను. బ్రతిమాలవ్రా ! గవ్వలు తినమని బ్రతిమాలవ్రా !"

"సరే అయితే ! మీరు తినటం మానేస్తే నేను సహించలేనండి ! మీరు అన్నం మానేస్తే నేను చచ్చిపోతానండి ! మీరు మంచినీళ్ళు తాగకపోతే నా వూపిరి గడ్డస్తుందండి ! ఈ ఒక్కసారికి నన్ను క్షమించి, అన్నీ తెయ్యరూ ? ఈ ఒక్కసారికీ మన్నించరూ ?"

"అంత జేలవైపోతావేం బాలా ? నీ తప్పిదం వప్పుకున్నావు. అంతే చాలు ! నిన్ను క్షమిస్తాను. గవ్వలన్నీ తినేస్తాను. ఇంకా తీసుకురా ! తినేస్తాను. నా క్షమా హృదయాన్ని ఋజూచేస్తాను. నాగుండెల్లో నవనీతాన్ని చూపిస్తాను. పళ్ళెంలో గవ్వలన్నీ..."

పద్మ విరగబడి నవ్వడం మొదలుపెట్టింది. సారథి అదేం పట్టించుకోకుండా గుప్పెడు గవ్వలు నోట్లో పోసుకున్నాడు.

"హోహోయ్! నవ్వావ్, మహా!"

"నేనేదో తప్పుచేసి మిమ్మల్ని బ్రతిమాలుకున్నట్టూ; మీరేమో జాలిపడి, క్షమించినట్టూ-ఏం పోజు పెడతారు!"

"ఇక ఆ చాప్టర్ ఖతమ్ హోగయా! మరేమైనా కబుర్లు చెప్పు."

"ఏదీ చెబుదాం అనుకొంటే మీ నాటకం సరిపోయింది. మీకేదో ఉత్తరం వచ్చింది. చూడండి, డెస్కులో పడేశాను."

"ఎక్కణ్ణుంచేమిటి?" అంటూ సారధి డెస్కులోంచి కవరు తీశాడు. అడ్రస్ రైటింగుచూస్తూ, మొహం ప్రశ్నార్థకంగా మార్చుకున్నాడు. "ఎవరిది చెప్మా! కొత్త రాతలా వుంది."

"తినబోతూ రుచి, అడుగుతారేం? చించి చూడరాదూ?" అంది పద్మ.

"పాయింటే! ఇంద. నీ గొప్పసలహాకో పాలకాయ. కాదు కాదు. గవ్వాకాబోలు" అంటూ సారధి భార్యామణి నోటికో గవ్వ అందించబోయాడు.

"నాకేం అక్కర్లేదు. నేను చేస్తూనే బోలెడుతిన్నాను" అంది పద్మ.

"ఓసి దురాత్మురాలా! నీ పతివ్రతా ధర్మం మండినట్లేవుంది. భర్తకు పెట్టకముందే బోలెడు తినేస్తావటే?"

పార్థసారధి నిటారుగా కూర్చుని భార్యకేసి తీక్షణంగా చూస్తూ చాలా కోపం చేసుకున్నాడు.

పద్మావతి అతి తేలిగ్గా — "సంతోషించాం లెండి" అనేసరికి అంత ఉగ్రనరసింహమూ నీళ్ళుగారిపోయింది. బింకంగా—

"ఈ తప్పిదం క్షమించితిని. మరి ఎన్నడూ భర్తకు పెట్టక మునుపే బోలెడు తినకు" అంటూ యధారూపాని కొచ్చేశాడు.

"అలాగే స్వామీ! ఇంతకూ ఉత్తరం చదవటం ఏమైనా వుందా?"

"ఎందుకు లేదు? ఉంది. వాళ్ళు బేడార్థణా తగలేసుకు రాసినందుకైనా...ఒక్కసారి చదివిపారేస్తే..." అంటూ వను చించాడు.

చిరంజీవి పార్థుణ్ణి...

ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిగా దీవించి ... మీ పెద్దమ్మ ఆండాళమ్మ వ్రాయించు ఉత్తర మేమనగా...

"ఎవరీ పెద్దమ్మ? ఆండాళ్ళమ్మ?" సారధి విస్తుబోయాడు.

"అయ్యో! అంతపొడుగున ఆశీర్వాదిస్తూ రాస్తే ఆ పెద్దమ్మ ఎవరో తెలీనే తెలీదా?" అంది పద్మ పూలు గుచ్చటం ఆపి, ఉత్తరంలోకి చూస్తూ.

"నిజమే పద్మా! నాకే పెద్దమ్మ ఎవరో గుర్తురావటం లేదు. ఏదో సామెత చెప్పినట్లు అమ్మాలేదు; అమ్మకి బంధువులూ లేరు. ఇక ఎవరీ ఆండాళ్ళమ్మా?"

"అబ్బ! ఎందుకండీ అంత ఆలోచిస్తారు? అంతా చదవరాదూ తెలుస్తుందేమో!" అంది పద్మ విసుగ్గా.

"పోయింటే!" అంటూ సారధి తిరిగి వుత్తరం ప్రారంభించాడు. చిరంజీవి పార్థుణ్ణి...

ఆయు...వృద్ధిగా దీవించి ... ఆండాళ్ళమ్మ ... ఏమ గా...నాయనా! పార్థుమా, నేను నీకు గుర్తువున్నానో, లేదోగాని—నువ్వు నాకళ్ళల్లో మెదులుతూనే వున్నావు. మూడేళ్ళ క్రిందట నీ పెళ్ళికొచ్చాను. నీ మంచిచెడ్డలు చూస్తూ నీదగ్గరసానే తిరిగాను. అప్పుడే నీ నెమ్మదీ, నీగుణం అవీ చూసి ముచ్చటపడ్డాను. నాకీ పరిస్థితుల్లో నువ్వే గుర్తు వచ్చావు నాయనా! అయిన వాళ్ళందరికీ శత్రువునయ్యాను. గప్పున నువ్వు కళ్ళలో మెదిలేసరికి...

"ఓహో! ఈ పెద్దమ్మా!" చటుక్కున ఏదో వచ్చినట్టు ఆగాడు సారథి.

"గుర్తువచ్చిందా? ఎవరావిడ?" అంది పద్మ కుతూహలంగా. సారథి జవాబు చెప్పకుండా సీరియస్‌గా మిగిలిన ఉత్తరం చదవసాగాడు.

"నువ్వు...జ్ఞాపకం వచ్చేసరికి ప్రాణానికి సంతోషం కలిగింది నాయనా! నీదగ్గరికొచ్చేసి వుండాలని అనుకొంటున్నాను"

"ఏమిటీ? ఆవిడ మనింటికొచ్చేసి వుంటుందా?" పద్మ అడిగింది సంతోషంగా—"అబ్బ నువ్వు అడ్డురాకు. నన్ను చదవనీ!" విసుగుదలా, ఆతృతా మిళాయించి ముందుకు సాగాడు సారథి.

"నేనల్లుడు గదా అని సూరిగాడి పంచకు చేరాను. ఎవడి పంచన చేరితే మాత్రం నన్నేం వుత్తపుణ్యానికి పోషిస్తారేమిట్రా! బ్రతికినన్నాళ్ళూ తిన్నది తినగా, నన్ను తర

టంత ఆస్తివుంది. ఆ సంగతి మీకు అందరికీ తెలిసిందేగా! కాశీలో కూర్చున్నా ఏడాది తిరిగొచ్చేసరికి కాళ్ళమీదికొచ్చి పడుతుంది రొక్కం. ఎవడి సంపాదనా నాకు రాగిదమ్మిడీ అక్కర్లేదు నాయనా! మొన్న సంక్రాంతికి వాడి చిన్న కూతురికి ముచ్చటపడి రెండుపేటల పలకసర్లు గొలుసు చేయించాను దండిగా వుంటుందికదా అని – పదికాసులుపెట్టి మరీ చేయించాను. వాడి సంసారానికైనా చెయ్యొత్తిగా వున్నప్పుడల్లా – పెద్దదాన్ని చూస్తూ ఎలా వూరుకుంటాను [illegible]. కాస్తో, కూస్తో సర్దుతూనే వచ్చాను. ఇంతా జేస్తే వాడెంతటి విశ్వాసఘాతకుడయ్యాడురా నాయనా! పెళ్ళాం, దాని చెప్పుడు మాటలు విని నామీదకొచ్చి పెద్దా, చిన్నా చూడకుండా నానా కూతలూ కూశాడు. మొగుణ్ణి నామీదికి తోలి అది రాచిప్పలా చోద్యం చూస్తూ నించుంది. కొవ్వ కుంటే సిగ్గు, మేనల్లుడే! ఇంట్లోంచి పొమ్మన్నాడు. పెద్ద దానివే గాని బుద్ధి లేదన్నాడు. సంసారాలు పాడు చెయ్యటానికే తిరుగుతున్నావన్నాడు. ఎన్ని అన్నాడని నాయనా! కళ్ళ నీళ్ళు కళ్ళ గుక్కుకొని లేచి చక్కావచ్చాను. ఓ మంచిపని మాత్రం చేశాననుకో! ఆ గొలుసూ – కాయితాలూ అవీ ఏవీ వుంచకుండా చక్కాపట్టుకొచ్చాను. నేను పనికిరాని వాళ్ళకి నా సొమ్ములెలా పనికివస్తాయిరా? ఇప్పుడు పూజారి నరసింహంగారి వసారాలో ఓ తవ్వెడు నూకలు పొంగించు కుని రెండుముద్దలు తింటున్నాను. నీ జవాబు చూసుకుని దగ్గరికి రావాలని పుట్టెడాశతో వున్నాను. కోడలుపిల్ల

...ంచిదని మనవాళ్ళంతా అనుకుంటారు. ఆ ఏడుకొండల వాడిని స్మరించుకొంటూ ఇక మీదగ్గిరే పడివుందామని వుంది. నాయనా! ఓ కార్డుముక్క రాయి. వెంటనే బయల్దేరి వస్తాను. కోడలిని దీవిస్తున్నానని చెప్పు. మనమడికి ముద్దులు. ఉంటాను మరి.

ఇట్లు,
మీ పెద్దమ్మ ఆండాళ్ళమ్మ.

"పాపం! ఎవరండి ఆవిడ?" అంది పద్మ సానుభూతిగా. "పాపంలేదు గీపంలేదు. మాయింటికి రావటానికి వీల్లేదని జవాబు రాసేస్తాను" అన్నాడు సారథి ఆవేశంగా. పద్మ తెల్లబోయింది — "ఎందుకలా కంగారు పడతారు? ఆవిడేం దెయ్యమా? భూతమా?"

"అంతకన్నా ఘోరం. నిజం పద్మా! నీకు తెలియదు కానీ, చాలా ప్రమాదకరమైన మనిషి. కావలసిన వాళ్ళంతా వదులుకుంటూంటే మన కెందుకీ తద్దినం?"

"అసలావిడ ఎటువంటి పెద్దమ్మండీ మీకు?"

"మా తాత పెళ్ళాం మొగుడి అల్లుడి మేనల్లుడి భర్త గారి అత్తగారి అప్పగారి—నా మొహం నా కొకటి తెలుసా అని! నీకు చెప్పడానికి. ఏదో చుట్టం. వరసకి పెద్దమ్మ. అందరితోపాటు పెళ్ళి కొచ్చింది. అన్నీ తనే అన్నట్లు పూనుకు తిరిగింది. నన్ను దృష్టిలో పడేసుకుని ఇప్పుడు దాడి చేయబోతూంది."

పద్మ నవ్వింది—"అయితే దూరం అంటారేం? చాలా దగ్గర."

"హాస్యంకాదు పద్మా! ఆవిడ మొహమాట మేమిటి మనకి! సింగినాదం. రావడానికి వీల్లేదని రాసేస్తాను."

"ఏం? వచ్చి మన యింట్లోవుంటే మనకి పెద్ద దిక్కుగా వుంటుంది కదూ?" అంది పద్మనెమ్మదిగా.

"ఆవిడ విషయం తెలియక అలా అంటున్నావు కానీ, మంచిదికాదు పద్మా!"

"అంటే?" ఏమిటన్నట్లు సారథి మొహంలోకి చూసింది పద్మావతి.

"అంటేనా!...అంటే...ఏమో మరి. ఆవిడ మంచిది కాదని బంధువులంతా చెప్పుకుంటారు."

"మంచిది కాదంటే ఏమిటని?" గట్టిగా అడిగింది పద్మావతి.

సారథి జుట్టులోకి వ్రేళ్ళుపోనిచ్చి కాస్సేపు ఆలోచించి ఏదో తోచినట్లు—"అంటేనా? చెప్పమంటావా? ఆవిడ అచ్చు సినిమాల్లో సూర్యకాంతం. ఈ ఆండాళ్ళమ్మకీ, ఆ సూర్యకాంతానికి తేడాలేదు. అదీ! తెలిసిందా?" అనేసి సరిగ్గా చెప్పగలిగాను కదా అన్నట్లు చూశాడు.

పద్మ క్షణం ఆగి—"పాపం ఆవిడ మీకంత ఆప్యాయంగా ఆశగా వుత్తరం రాస్తే, ఎందుకండీ అలా ఆడిపోసుకుంటారు?" అంది జాలిగా. నిజంగా పద్మావతికి ఆండాళ్ళమ్మగారి మీద సానుభూతే కలిగింది.

"అయితే నువ్వనేదేమిటి ?"

"ఆవిడ వస్తానంటోంది కదా ! రానివ్వండి."

"పద్మా ! నీ కేం మతిపోయిందా! ఆవిడ ఆస్థిపాస్తుల్ని కూడా లెక్క చెయ్యకుండా ఆవిణ్ణి కావలసినవాళ్ళంతా దూరం చేసుకుంటున్నారంటే కారణం ఏమిటో ఆలోచించావా ?"

"ఏది ఆలోచించడానికైనా ఆవిడ అసలు నాకేం తెలుసు ? ఆవిడకు పిల్లలులేరా ?" అడిగింది పద్మ.

"ఆవిడ విషయాలన్నీ నాకూ అంతగా తెలీవు. మన పెళ్ళికొచ్చినప్పుడే ఆవిణ్ణి గురించి నలుగురూ అనుకోగా విన్నాను. బోలెడు ఆస్థిపాస్థి, లంకంత లోగిలీ వున్న ఇల్లా లేపలం. ఒక్కగా నొక్క కొడుక్కి చిన్నతనంలోనే పెళ్ళి చేస్తే, భార్య పెద్దమనిషైనా కాకముందే ఆ పిల్లవాడు కాస్తా ఏదో జబ్బుచేసి చచ్చిపోయాడట. కొడుకుమీద బెంగతో టి పెళ్ళాంతో సరిపడకా, ఆవిడ మొగుడు కాస్తా, ఓనాటి రాత్రికి రాత్రే రహస్యంగా కాశీకి బయలుదేరి పోయాడట. అది ఎప్పుడో ముప్పయ్యేళ్ళనాటి మాట. ఇప్పుడాయన కాశీలోనైనా వున్నాడో-చచ్చాడో ఎవరికీ తెలీదు. ఈవిడ మాత్రం మొగుడిమీదకోపంతో గాజూపూసా తీసిపారేసింది. పాపం ఆ కోడలు మొగుడు లేకపోయినా, అత్తగారి దగ్గరకు వచ్చిందట. ఏదో ఆ పిల్లనైనా చూసుకుంటూ నిక్షేపంలా ఆ యింట్లో పడివుండకూడదూ ? ఆ పిల్లనికూడా అతకనివ్వకుండా రోజూ 'అలాంటి ముండవి. ఇలాంటి ముండ

నిన్ను కట్టుకోక పోయినా నా కొడుకు బ్రతికేవాడు. పాపిష్టి దానా! నువ్వే నా కడుపు కాల్చావు' అంటూ చంపుకు తింటూవుంటే కొన్నాళ్ళకి కావలిసినవాళ్ళంతా కలుగజేసుకుని ఉన్న ఆస్తి యిద్దరికీ చెరిసగం పంచేసి ఎవరి దారిన వాళ్ళని పొమ్మన్నారట. ఆ అమ్మాయి పుట్టింటికి వెళ్ళిపోయిందిట. చెల్లెలి కొడుకుని కాబోలు, దత్తత తీసుకుందన్నారు. లక్షణం గానే బ్రతుకుతూంది. ఇక ఈవిడ సంగతి, ఒక నికరంలేదు. ఎక్కే గడపా, దిగే గడపా! నెలకో యింట్లో పాదం మోపు తుంది. వాళ్ళతో ఏదో గొడవ తెచ్చుకుంటుంది. మరో చోటికి బయల్దేరుతుంది. బిడ్డలు లేరనేగానీ, అంతకన్నా ఎక్కువగా చూసుకునే మేనకోడళ్ళూ, మేనల్లుళ్ళూ అక్క బిడ్డలూ, చెల్లెలిబిడ్డలూ, బంధువులూ చాలామంది వున్నారు. ఏం లాభం! ఎవర్నీ అతకనివ్వదు. ఎక్కడా మంచిగా వుండదు. మతిపోయినట్లు తిరుగుతూ వుంటుంది."

"పాపం! కష్టాలుపడి వుండటంచేత, మతి చలించినట్లు వుంటుందేమోనండీ!" అంది పద్మ జాలిపడుతూ.

"నీ మొహం—అవిణ్ణి సమర్థిస్తున్నదానివి నువ్వొక్క దానివే కనపడ్డావు. ముందు డబ్బుకు కక్కుర్తిపడి చేర నిచ్చినా వెధవపోరు ఎన్నాళ్ళని సహిస్తారు? పొమ్మంటారు. మరోచోటికి చేరుతుంది. మేనల్లుడు గురించి వ్రాసిందే ఉత్త రంలో; వాడు నాకు బాగా తెలుసు. చాలా మంచి వాడు. ఈవిడలో ఏ లోటూ లేకపోతే సూర్యం ఎప్పుడూ దురుసుగా......"

"పెద్దావిడ ఏమైనా అంటే మాత్రం తప్పా? ఆ మాత్రం సహించకూడదూ?"

పార్థసారథికి చిరాకు వేసింది—"అయితే నువ్వనే దేమిటి?"

పద్మ మాట్లాడలేదు. సారథి తమాయించు కున్నాడు. నెమ్మదిగా—"చెప్పు పద్మా! ఆవిణ్ణి రమ్మనటం నిజంగా నాకు యిష్టంలేదు. నీ అభిప్రాయం చెప్పు." అన్నాడు శాంతంగా.

"ఆవిణ్ణి గురించి మీరు చెప్పింది నూటికి నూరుపాళ్ళు నిజం కాదనిపిస్తుంది నాకు. వాళ్ళు వీళ్ళు చెప్పగా విన్నదేగాని, [illegible]ంచి మీకు స్వయంగా తెలీదుగా! లోకులు చెప్ప[illegible] [illegible]నకేం భాగ్యం? కాస్తవుంటే ఇంకా కాస్త కలుపుతారు."

"మరి ఆవిడకు కావలసినవాళ్ళు చాలామంది వున్నారు కదూ? ఎక్కడో ఓ చోట నికరంగా ఎందు కుండ దంటావ్?"

"బావుంది! ఆవిడకూ, వాళ్ళకూ ఏం గొడవ లున్నాయో! ఎవరికి తెలుస్తాయి? ... అయినా చాలా మందికి పెద్దవాళ్ళుండటం గిట్టదు."

"పోనీ! నువ్వు చాలా మంచిదాన్నంటావు!"

"ముమ్మాటికీ! అత్తా, ఆడబిడ్డలు వుండటం చాలా మంది అమ్మాయిలకు యిష్టం వుండదు. కానీ వాళ్ళుండాలని నే నెంతో కోరుకున్నందుకే కాబోలు నాకు ఎవరూ లేరు.

'అత్తయ్యా' అని పిలుస్తూ తిరగాలని నా కెంతో కోరికగా వుంటుంది."

"దాని కేం! నిక్షేపంలా ఆ వంటచేసేటప్పుడూ అప్పుడూ 'అత్తయ్యా!' అని నన్నే పిలుస్తూండు. లక్షణంగా పలుకుతుంటాను."

"సరేపోతారు. అర్డర్లు వేయటానికీ, అథార్టీలు చెయ్యడానికీ మీరే నలుగురత్తలపెట్టూ, ఆరుగు రాడబిడ్డల పెట్టూను."

"అందుకే నా మాట విని, నాతో సంతృప్తిపడి వూరుకో."

"అదేం కుదరదు. ఆవిడ గతచరిత్ర మనకు అవసరం లేదు. ఆవిడ ఏలాంటిదైతేనేం? నేను మంచిగా వుండి ఏ గొడవా రాకుండా చూసుకుంటాను. ఆవిణ్ణి రమ్మని రాద్దాం."

"ఎందుకు నీకింత పట్టుదల?"

"ఇందులో పట్టుదలేముంది చెప్పండి? మనకు ఇంట్లో పెద్ద దిక్కేవగూ లేదు. మీరు వున్నంతసేపూ సర్దాగానే గడుస్తుంది. బాబుతో ఒక్కదాన్నే వుంటే కాస్త పొద్దుపోయే వరకూ మీరు రాకపోతే ఏడుపొచ్చినంత పనవుతుంది ఒక్కోసారి. ఆడవాళ్ళకి ఆడసాయంవుండడం ఎంత అవసరమో మీకేం తెలుసు? బాబు నెత్తుకొచ్చిన దగ్గిర్నుంచీ నాకు మరీ ఒక్కదాన్నీ వుండాలంటే భయంగా వుంటోంది. మొన్నరాత్రి చూశారా? కాస్త వాడి ఒళ్ళు వెచ్చబడేసరికి యిద్దరం

తెల్లవార్లూ పాడిలిపోతూ కూర్చున్నాం. అటువంటి సమయంలో పెద్దవాళ్ళెవరైనా వుంటే ఎంత ధైర్యంగా వుంటుందనీ! ఆవిడకై ఆవిడ వస్తానంది కదా ?,,

పద్మ మాటలు వింటూంటే సారధికి కూడా క్షణం నిజమేననిపించింది. మరుక్షణంలోనే ఆవిడంటే ఏదో జంకు వంటి భావం పుట్టుకొచ్చింది. — "నువ్వు దూరంగా ఆలోచించటంలేదేమో పద్మా! నిప్పు లేనిదే పొగరాదట. ఆవిడ మంచిదైతే ఉత్తినే పుకార్లు పుట్టవు. అటువంటి మనిషిని పెట్టుకొని సుఖపడిపోతా మనుకోవటం కూడా భ్రమే."

పద్మ మాట్లాడలేదు. సారధి క్షణం ఆగి—"కొంపతీసి ఆవిడ డబ్బూ దస్కం ఇస్తుందని ఆశపడుతున్నావేం ఖర్మ." అంటూ హాస్యమాడితే పద్మకు కోపం వచ్చింది — "ఛ! నన్నింత తేలికగా భావిస్తారనుకోలేదు. మీ యిష్టం వచ్చినట్టు చేసుకోండి." అంటూ లేచి వెళ్ళిపోబోతూన్న పద్మావతి కొంగుపట్టుకు ఆపాడు సారధి. "అంత కోపం అయితే ఎలా అమ్మాయ్! ఇప్పుడు మునిగిపోయిందేమీ లేదుగా? నీ యిష్టప్రకారమే కానీ! కాని నాకై నేను మాత్రం ఆవిడ్ణి రమ్మని రాయను. రాయకపోయినా వచ్చి తీరుతుంది."

"అవును మరి. మీారుద్ధరిస్తారని వచ్చి తీరుతుంది. తీరా వస్తే పొమ్మనండి. బావుంటుంది" అంది పద్మ విసుకుగా.

"ఏ గొడవా రాకుండా పదిరోజులపాటు మనం ఎక్కడైనా పోయామంటే ఆవిడ వచ్చినా, వచ్చిన దారినే వెళ్ళిపోతుంది. కాని నీకేమో ఆవిడమీాద మహామోజుగా వుంది

మరి. సరే! అదీ చూద్దాం! కాని అంత్యనిష్ఠూరంకన్నా, ఆదినిష్ఠూరం మంచిదటోయ్ పద్మావతీ!"

"అయ్యో! మీకు రాని సామెతలంటూ వున్నాయా?"

"మరే! లేవు. అందుకే శాస్త్ర ఆలోచించి చూడండి పద్మావతిగారూ!"

"మీ సలహా పాటించలేకపోతున్నాం పార్థసారథి గారూ!" అనేసింది పద్మ నిర్లక్ష్యంగా.

"ఓసీ! దుర్మార్గురాలా! భర్తను ధిక్కరిస్తావుటే?" అంటూ నిటారుగా కూర్చుని సారథి కోపం చేసుకుంటూంటే గుచ్చుకున్న పూలమాల జడలో పెట్టుకుంటూ నవ్వేసింది పద్మావతి.

♦ ♦ ♦

పార్థసారథి ఉత్తరానికైతే జవాబు రాయలేదుగానీ, ఏ దుర్ముహూర్తానో ఆండాళ్ళమ్మపెద్దమ్మ సుడిగాలిలా చుట్ట బెట్టుకు వచ్చేస్తుందని గడగడలాడుతూనే వున్నాడు. పద్మావతి మాత్రం ఆ శుభక్షణం ఎప్పుడొస్తుందా అని వేయికళ్ళతో ఎదురుతెన్నులు చూస్తోంది.

ఆదివారంపూట భోజనాలైన తర్వాత బాబుని నిద్ర పుచ్చి, తీరిగ్గా పక్క సర్దుకు పడుకున్నాడు సారథి. పద్మ వంటగది సర్దుకు వచ్చి కుర్చీ మంచం దగ్గిరకి జరుపుకు కూర్చుంది. "పద్మా! ఏదైనా చదువు! వింటూ పడుకుంటాను." అన్నాడు సారథి. పద్మావతి క్రిందటిరోజే వచ్చిన

...త్త వీక్లీ తిరగవేస్తూ ఒకథ ప్రారంభించింది. వదినా మర దళ్ళ సరసాలతో — అత్తాకోడళ్ళ హాస్యాలతో కథ మాంచి సర్దాగా సాగిపోతోంది. ఒక్కసారిగా పద్మావతి మనసు అత్త గారి మీదికి పోయింది. చటుక్కున పుస్తకం మూసిపారేసి— "ఏమండీ? ఉత్తరం రాయకపోయినా ఆవిడ వచ్చేస్తుం దన్నారే?" అంది అబద్ధం చెప్పారేం? అన్నట్టు.

"ఎవరావిడ? మండోదరా?"

"హాస్యాలకేం గాని ఆండాళ్ళమ్మగారు రాలేదేమండీ?"

"మన పాపం ఇంకా పండివుండదు." అంటూ తల గడలో మొహం పెట్టుకున్నాడు సారథి. పద్మకు కోపం వచ్చింది. కానీ తమాయించుకొంది. నిద్రపట్టక అటూఇటూ దొర్లుతూన్న సారథికి అనునయంగా చెప్పటం ప్రారంభిం చింది—"పాపం ఆవిణ్ణి ఎవరూ గిట్టనివ్వకగానీ, లేకపోతే మనం తపస్సుచేస్తే మాత్రం మన ఇంటికి వస్తుందేమిటి? పెద్దవా ళ్ళుంటూ వుంటే కష్టానికీ, సుఖానికీ ఎంత సాయం! చాద స్తంగా వాళ్ళేదో అంటే అంటారు. మన మంచికే చెబు తారు. ఆమాత్రం మందలించే వాళ్ళు మాత్రం వుండద్దూ? అంతమాత్రానికే..."

"ఓ పద్మావతీ! నీ ఉపన్యాసం కాస్త ఆపుజేస్తావా!" అన్నాడు సారథి దిండులోంచి మొహం పైకెత్తి.

"ఓ! అలానే ఆపుజేస్తాను పూర్తి కాగానే — ఆ చూడండీ! అత్తయ్యా! అత్తయ్యా! అంటూ తిరగటం

అత్తగారి ఒద్దికతో పనిపాటలు చేసుకోవటం ఎంచక్కా వుంటుందో !"

"నా మొహంలా వుంటుంది."

"మీ మొహానికేమండీ? చంద్రబింబంలా ఎంచక్కా ముద్దొస్తూ వుంటేనూ; అత్తగారితో కాపురం కూడా యింత చక్కగానూ వుంటుందంటారా ?"

"నాకు నిద్రవస్తోంది పద్మా ! ఈ ఆదివారం పూటైనా..."

"అవును పాపం ! ఈ ఆదివారం పూటైనా నిద్రా దేవత సెలవు తీసుకోకపోవటం ఏమీ బాగు లేదు. కష్టమే" అంటూ పద్మావతి గాఢంగా నిట్టూర్చింది.

"గడుసు కబుర్లు చెప్తున్నావే !" సారధి లేచి పద్మ నందుకోబోయేసరికి వీధిలో రిక్షా ఆగిన చప్పుడూ; దాని వెనకే వీధి తలుపులమీద చిన్నసైజు పిడుగులూ !

"ఒరేయ్ ! అబ్బాయ్ ! పార్థసారధీ ! పార్థుడూ ! ఒరేయ్ !"

"అదిగో పెద్దమ్మ—ఆండాళ్ళమ్మ—వచ్చేసింది, వచ్చే సింది." అంటూ దిగ్గున లేచి కూర్చున్నాడు సారధి. పద్మ మెరుపులా వీధి గుమ్మంకేసి పరుగుపెట్టింది. తలుపుతీసింది.

పద్మావతి ఎదుట ఆండాళ్ళమ్మ ! తెల్లటి పంచెలో పొట్టిగా పచ్చగా గుమ్మటంలాంటి ఆండాళ్ళమ్మ ! తలుపులు తీసీ తియ్యగానే పద్మావతి కళ్ళల్లోకి సూటిగా చూసేస్తూన్న

ఆండాళ్ళమ్మ! అట్టి ఆండాళ్ళమ్మగారి చుట్టూ ఓనల్లసంచీ–ఓ తెల్లసంచీ–ఓ గుడ్డల మూటా– మరచెంబూ–మేదరబుటా వగైరా వగైరా సపరివారంగా సామానుసమేతంగా వచ్చేసింది ఆండాళ్ళమ్మగారు. పద్మావతికి పుట్టెడు సంతోషం కలిగింది. జగజ్జనని దర్శనమిచ్చినా పద్మావతికి అంత సంతోషంకలగదేమో! – "రండి! అత్తయ్యగారూ! రండి. ఆఁ ఉండండి. కాళ్ళు కడుక్కునేందుకు నీళ్ళు తెస్తాను." అంటూ ఒక్కసారి అదృశ్యమై చల్లటి నీళ్ళతో నిండిన నిలువుచెంబు దక్షిణహస్తంలో ధరించి ప్రత్యక్షమైంది.

"పార్థుడు లేడే పిల్లా? ఉత్తరానికి జవాబైనా రాశాడు కాదు. నా ఉత్తరం మీకందలా?" ముందీ సంగతి తేల్చుకుంటానన్నట్టు నిలదీసి అడిగింది ఆండాళ్ళమ్మగారు.

అప్పుడే గదిలోంచి వస్తూన్న పార్థసారథి నీ ఉత్తరమేమిటో నువ్వేమిటో ఎరగం పొమ్మందామనుకున్నాడుగానీ అంతలోనే పద్మావతి—

'అందింది అత్తయ్యగారూ! జవాబు కూడా రాస్తావన్నారే!' అనేసిందని ఊరుకున్నాడు.

"ఏం జవాబు రాశారూ? నాకందందే" అంది ఆండాళ్ళమ్మగారు.

"అయ్యో! పెద్దమ్మా! నా'జవాబు నీకు' అందనే లేదూ?" అంటూ రంగంలో ప్రవేశించాడు సారథి అమాయకంగా.

—"నీ వుత్తరం చదవగానే నా కడుపు చెరువై పోయింది పెద్దమ్మా! నువ్వు కార్డుముక్క గాయమన్నావు గానీ నా మనసు ఒప్పక తక్షణం బయల్దేరి రమ్మని పెద్ద కవరు రాశాను పెద్దమ్మా!"

పద్మ కొంగు నోటికి అడ్డుపెట్టుకొంది.

సారథి మళ్ళా అన్నాడు – "నిజం చెప్పొద్దూ? నిన్ను తీసుకురావటానికి మొదట పద్మ ఒప్పుకోలేదుగానీ, నేను నచ్చజెప్పేసరికి పాపం వూరుకొంది." పద్మావతి చురచురా చూస్తున్నా, లక్ష్యపెట్టలేదు సారథి. ఆదిలోనే అత్తా కోడళ్ళకి మనస్పర్థలు కలిగించాలని పార్థుడి తాపత్రయం.

"ఇంతకీ నా వుత్తరం నీకందలేదన్నమాట. రేపో, మాపో నిన్ను తీసుకురావటానికి నేనే వద్దామనుకుంటున్నాను కూడా. లేకపోతే నిన్ను కష్టాల్లో వదిలేసి ఎలా వూరుకుంటాను పెద్దమ్మా?"

"నా నాయనే! అందుకే కాదుట్రా నీ యింటి కొచ్చాను. అవుతే జవాబు రాశావన్నమాట. అయ్యో! ఎక్కడ అందనిస్తార్రా? ఆ సూరిగాడు నామీద కత్తి కట్టాడు కాదూ? ఆ వుత్తరాలవాణ్ణి అటకాయించి, ఆ వుత్తరం కాస్తా వూళ్ళోకి చించి పోగులు పెట్టివుంటాడు. దొంగవెధవ."

"పోనీ పెద్దమ్మా! నువ్వు వచ్చేశావు; అంతే చాలు. ఆరోగ్యం అదీ బాగుంటోందా?" పైకి క్షేమం అడుగుతూనే—

"నీ ఆరోగ్యానికేం పోటీ వుండదులే" అనుకున్నాడు సారథి మనసులో.

"ఏం ఆరోగ్యంలేరా అబ్బాయ్! పట్టుమని పదిముద్దలు తినలేనుగదా? అరిగి చావదు." అంటూ వాపోయింది ఆండాళ్ళమ్మగారు. 'అయ్యో, పాపం!' అనుకొంది పద్మావతి.

"హమ్మో! నీ పట్టుతో పదిముద్దలే!" హడలిపోయాడు పార్థసారథి. వీధిలోంచి రిక్షావాడు కేకలెడుతున్నాడు — "బామ్మగారూ! ఎండలో నిలబడిపోయాను. డబ్బులిప్పించండమ్మా! పోతాను" అంటూ.

"ఓరి నీమొహం మండా! ఇంకా వెళ్ళలేదట్రా? చూడవే అమ్మాయ్! ఆ తెల్లసంచీలో చిల్లరుంది, ఓ పావలాబిళ్ళ వాడి మొహాన..."

"ఇప్పుడు సంచీ తియ్యటం ఎందుకులెండి అత్తయ్యా! డబ్బులు నా దగ్గిరున్నాయి, ఇస్తాను" అంటూ పద్మావతి వంటగదిలోకెళ్ళి పోపుల పెట్టెలో భద్రం చేసుకుంటూన్న స్వంత ధనంలోంచి ఓపావలాబిళ్ళ తెచ్చి అత్తగారు చెప్పినట్టు అతిరాలా రిక్షావాడి మొహాన్న విసిరింది.

"స్టేషన్ నుంచి ఈ వీధికి బేడేకాదుటోయ్" అన్నాడు సారథి.

"బేడే అనుకోండి బాబూ ఒక శాల్తీకి."

"మరి ఇద్దర్నీ తీసుకొచ్చావా ఏమిటి?"

"ఇద్దరు కాదనుకోండి బాబూ..." రిక్షావాడు నసుగుతూ నిలబడితే సారథి నవ్వు ఆపుకొని— "సరేలే! వెళ్ళు!

వెళ్ళు !" అంటూ వాణ్ణి పంపేశాడు. అంత గ్రహించుకొని ఆండాళ్ళమ్మగారు — "పోనీలే! వెధవ! మోసుకొచ్చాడు" అంటూ జాలిపడింది.

"ముందు కాళ్ళుకడుక్కోండి అత్తయ్యా !" అంది సవినయంగా కోడలు పద్మావతి అత్తగార్ని మర్యాద చేస్తూ.

"కడుక్కుంటానే తల్లీ ! కడుక్కుంటాను. అనక ఆ పావలాబిళ్ళ తీసేసుకో సుమా !...... నాకేమిటో మీ ఇద్దర్నీ చూస్తోంటే ఆనందం పొంగు కొస్తోందర్రా" అంది ఆండాళ్ళమ్మగారు మహదానంద పడిపోతూ.

"నూం పాపం పండిపోయింది. నీకు ఆనందం పొంగుకు రాదూ మరి ?" అనుకున్నాడు సారధి మంటగా. అత్తగారి ఆనందం కళ్ళారా చూసిన కోడలు పిల్ల సిగ్గుపడుతూ ముడిసి పోయింది. ఆండాళ్ళమ్మగారు లేచివెళ్ళి నిలువు చెంబెడు నీళ్లు వీధి ఛీడీల మీద బొడబొడా ఒంపేసుకొని లోపలికొస్తూ — "హాడు ఎండ! ఏం కాస్తోంది! ఏం కాస్తోంది! కాస్త దాహం నీళ్ళు వుంటే చూడు తల్లీ ! గొంతు ఆర్చుకు పోతూంది" అంది.

"ఫర్వాలేదులే. గుండె ఆగిపోదు." అనుకొని — "కుర్చీలో కూర్చో. పెద్దమ్మా !" అంటూ మర్యాద చేశాడు సారధి

"ఆ, నాకు కుర్చీ లెందుకులేరా!" అంటూనే కుర్చీలో జేరబడి— "ఈ కుర్చీలూ అవీ నికెళ్ళాం తెచ్చుకుందేమిట్రా! మీ అత్తారు వున్నవాళ్ళేనేమిటి ?" అంది గొంతు తగ్గించి.

"మొదలుపెట్టావా ?" అనుకొని — "ఆఁ ఏదోలే, మనవంటివాళ్ళే" అన్నాడు.

"బావుందిరా నాయనా! బావుంది. అదృష్టవంతుడివి. లక్షణంగా పెళ్ళాం, కొడుకూ. ఆఁ అన్నట్టు పిల్లాడేడీ ?"

"నిద్రపోతున్నాడత్తయ్యా !" అంటూ అర్ధగజం మజ్జిగగ్లాసు అందించింది పద్మావతి

దాహం అందుకొంటూ— "ఫర్వాలేదు. లేపి తీసుకరావే తల్లీ! వాణ్ణి చూడకపోతే నా ప్రాణం ఆగదు" అంది ఆండాళ్ళమ్మగారు మరి ఆగలేనట్టు.

"నిజంగా వాణ్ణి చూడకపోతే ఈవిడ ప్రాణం పోతుందీ? వాణ్ణి చస్తే చూపించను." దృఢనిశ్చయం చేసుకున్నాడు పార్థసారథి. కాని పద్మావతి భర్తగారి దృఢనిశ్చయాన్ని సడలించేస్తూ లోపలి గదిలోకెళ్ళి నిద్రపోతున్న కొడుకును తీసుకొచ్చి అత్తగారికి అందించి మరీ వూరుకుంది.

"అమ్మ! అమ్మ! ఎంత ముద్దుగా వున్నాడే! పాలు సరిపోతున్నాయేవిటే? పాత్రాంటా వున్నాడు" అత్తగారు అంటూంటే పద్మావతికి చీమకుట్టినట్టుమాత్రం అయింది. చీమే కదా అని దులపేసుకొంది.

"పసివెధవ మీదే పడ్డాయా నీ కళ్ళు? నువ్వు లేపూ డోలులాగ." అనుకుని మండిపడ్డాడు సారథి.

ఆండాళ్ళమ్మగారు నిద్రపోతూన్న పిల్లవాణ్ణి కుడి వేస్తూ—

"ఇంకా నిద్రేమిట్రా? బామ్మని వచ్చాను. చూడరా బాబూ! నీకో మాంచి బహుమతి తెచ్చానురోయ్! ఏదే అమ్మాయ్! ఆ నల్లసంచీ ఇలా పట్రా!" అంటూ పురమాయించింది. పద్మావతి అర్థంగాకపోయినా ఫలానా నల్లసంచీ తెచ్చి అత్తగారికిచ్చి చూస్తూ నిలబడింది. ఆండాళ్ళమ్మగారు సంచిలో పైనపెట్టిన నీరుకావి పంచెలన్నీ తప్పించి పాతాళం లోంచి ఓబొట్లుపెట్టెవంటి పెట్టె పైకి తీసింది. తాళ్ళు విప్పి, పెట్టె తెరిస్తే అందులో ఓగుడ్డమూట! గుడ్డమూటలో దంతం భరిణె! దంతం భరిణెలో కాయితం పొట్లాం! కాయితం... పొట్లాంలో...

"ఈవిడి ప్రాణాలుగాని లేవుకదా?" ఊపిరి బిగబట్టి కళ్ళు చిట్లించి చూస్తూ మునివేళ్ళమీద నిలబడ్డాడు సారథి.

"అంత రహస్యంగా వున్న బాబిగాడి బహుమతీ ఏమిటో?" సస్పెన్సు భరించలేకపోతూంది పద్మావతి.

ఆ తెల్లటి కాయితం పొట్లాంలో మరో ఎర్రటి ఉల్లిపొర కాయితం! అందులోంచి రెండుపేటల పలకసర్లు గొలుసు తీసి విజయగర్వంతో ఆ దంపతులిద్దరికేసీ చూసింది ఆండాళ్ళమ్మగారు. గంటనుంచీ బిగపట్టిన ఊపిరంతా గుప్పుమని వదిలేశాడు సారథి. కళ్ళు చిట్లించుకుని మరీ గొలుసు చూసింది పద్మావతి. ఆండాళ్ళమ్మగారు గొలుసు బాబిగాడి మెడలో వేస్తూ—"ఇది నువ్వే వుంచుకోరా నాన్నా! అమ్మకు కూడా ఇవ్వకూ." అంటూ పిల్లాణ్ణి ముద్దుపెట్టుకొంది.

"ఇదేనా నువ్వు సూర్యం కూతురికి చేయించింది? పోసి దానికే వుంచెయ్యకపోయావా?" అన్నాడు సారథి.

"అదేం మాటరా! నేను పనికిరానివాళ్ళకి నాసొమ్ము లెలా పనికివస్తాయంటావ్! ఇది వుంచేసుకోవాలని మహా తాపత్రయ పడ్డాళ్లే. నేనా ఊరుకునేది?"

"పద్మా! బాబు నిద్రపోతున్నాడు. తీసికెళ్ళి పడుకో బెట్టు." అంటూ ఆండాళ్ళమ్మగారి ధోరణికి బ్రేకు వేశాడు సారథి. పద్మ పిల్లవాణ్ణి తీసికెళ్తూంటే—"అమ్మాయ్! గొలుసు భద్రం. జాగ్రత్త." అంటూ హెచ్చరించింది ఆండాళ్ళమ్మ గారు. పద్మావతి బాబుని పడుకోబెట్టి వంటగదిలో దూరి వేళగాకపోయినా ముగ్గురికీ కాఫీ చేసుకొచ్చింది.

"అమ్మాయ్, మీరు ఫలహారం చేసుకోరే?" అడిగింది ఆండాళ్ళమ్మగారు కాఫీగ్లాసు అందుకొంటూ.

"లేదత్తయ్యా! పిల్లవాడితో నాకొక్కదానికీ తీరదు. ఏదైనా సెలవునాడు చేస్తూంటాను" అంది పద్మావతి.

"అవును పెద్దమ్మా! నీ కోడలు టిఫెను గొప్పగా చేస్తుంది. తయారుచేశాకే పేరు పెడుతుంది" అన్నాడు సారథి నవ్వుతూ. ఆండాళ్ళమ్మగారు కూడా పకపకలాడుతూ నవ్వేసింది— "కేపట్నుంచీ వంటా అదీ నేను చూస్తుంటాలేవే అమ్మాయ్. నీ కొడుకునీ మొగుణ్ణి చూసుకో" అంది కోడలి పిల్లతో. అత్తగారూ, భర్తగారూ కలిసి తనకసలు వంటే రాదని నిర్ధారణ చేసేస్తూన్నందుకు పద్మావతికి కాస్త చిన్న తనమనిపించింది.

"అవును మరి, పెద్దవాళ్ళు చేసినట్టు చెయ్యలేను గదా!" అని తనకుతానే నచ్చజెప్పుకుంది.

"ఈ సంచులవీ లోపల దాచమంటారా అత్తయ్యా?" అంది ధోరణి మార్చుతూ.

"ఆ. ఆ. ఉండు అందులోవి పార్థుడికి కొన్ని కాయితాలు చూపించాలి." అంటూ గ్లాసు ఖాళీచేసి లేచివెళ్ళి తెల్లసంచీలోంచి మోపెడు కాయితాలు తీసి ఆ కట్టంతా పార్థుడి ముందు పడేసింది ఆండాళ్ళమ్మగారు.

"ఆఫీసు ఫైళ్ళేమైనా ఈవిడ సంచీలో పుట్టా యేమిటి?" అనుకొంటూ— "ఏమిటివన్నీ పెద్దమ్మా!" అన్నాడు సారథి.

"చూడరా తెలుస్తుంది. నేను మాత్రం ఏం జేసుకుంటాను గనకా? నువ్వే దాచుకో." అంది ఆవిడ తాంబూలం ఇస్తున్నట్టు. పద్మావతి కళ్ళు ఇంతింత చేసుకొని బుగ్గన వేలువేసుకొని కూర్చుంది పార్థసారథి కట్టవిప్పి ఒక్కో కాయితం చూడ నారంభించాడు—"ఫలానా ఊళ్ళో ఫలానా వారికి అప్పులిచ్చిన నోట్లు కొన్ని— చేబదుళ్ళిచ్చి సంతకాలు చేయించుకున్న కాయితాలు కొన్ని— ఇళ్లూ వాకిళ్ళూ తనఖా పెట్టి వ్రాయించుకున్న దస్తావేజులు కొన్ని— బకాయి పడిన మగతా తాలూకు రైతులు రాసిచ్చిన పత్రాలు కొన్ని— చానబోయే నోటుకి కొంత తీర్చిపెట్టి తిరగరాయించుకున్న బాపతుకొన్ని - గిన్నీ, చెంబూ, గాజూపూసా తాకట్టుపెట్టి వడ్డీ వివరాలతో రాసిన చీటీలు కొన్ని - ఎక్కడెక్కడి పొలాలకి ఎంతెంత ధాన్యం రావాలో వివరించే కౌళ్లు కొన్ని —

అన్నీ తడిపి మోపెడు కాయితాలైతే వున్నాయి. అవి వసూలు అయ్యేదెప్పుడో మరి— "హమ్మ! ఆండాళ్ళమ్మా! ఎన్ని వ్యాపారాలు చేస్తున్నావ్రా?" అనుకుని విస్తుపోయాడు సారథి.

"అన్నీ చూశావ్రా!" అంది ఆండాళ్ళమ్మగారు.

"చూశానుగాని పెద్దమ్మా! మనలో మనమాట. ఇవన్నీ వసూలయ్యేనంటావా?" సారథికి ఓ ధర్మ సందేహం.

"ఏవిటీ?" ఉరిమి చూసింది ఆండాళ్ళమ్మగారు. సారథి బిత్తరపోయాడు.

"వసూలు గాకపోతే వూరుకుంటామా? చచ్చి దెయ్యాలైనా పట్టుకుంటాన్రోయ్." అంటూ పకపకలాడింది ఆండాళ్ళమ్మగారు.

"అఘోరిస్తావ్." అనుకున్నాడు సారథి తేలుకుని.

"అన్నీ జాగ్రత్తగా దాచుకో. నువ్వే వసూలు చేసుకొందువుగాని." అంది ఆవిడ ధారాళంగా.

"అదేమిటి పెద్దమ్మా? దాచమంటే దాస్తానుగానీ నీడబ్బు నాకెందుకూ? నివాళ్ళే బోలెడుమంది వున్నారు."

"అదేంమాట? ఇప్పుడన్నావ్ గానీ ఇంకెప్పుడూ అనకు. నేను పనికిరాని వాళ్ళకి నాసొమ్ము ఎలా పనికివస్తుందిరా? నా ఆస్తిపాస్తుల్ని నా యిష్టం వచ్చినవాడికి ధారపోసుకుంటాను. ఎవడు కాదంటాడో చూస్తాను. అన్నీ నువ్వే వసూలుచేసుకో, ఇదిగో! ఇలా చూడూ, మా ఊళ్ళో కోవెల చేనువుపక్క రెండెకరాలూ నీకేరాసేస్తాను. ఆఁ అంతే" అంది ఆండాళ్ళమ్మగారు ఆవేశంగా.

పద్మావతికి కళ్ళముందు జిగేల్‌మని మెరుపు మెరిసి చిమ్మచీకట్లు కమ్మాయి. పెద్దమ్మ మాటలు వింటూ సారథి తెల్లబోయాడు—

"నాపేర పొలం రాస్తావా?"

"ఏం? తీసుకోవా?" అంది ఆవిడ భీకరంగా.

"అదికాదు పెద్దమ్మా! ఆ పొలం నువ్వు క్రిందటి సంవత్సరం సరోజకు పెళ్ళిలో చదివించావు కదూ?"

"ఆఁ సింగినాదం చదివించాను. చదివింపేగా? అప్పుడు నిజంగా ఇచ్చేద్దామనే చదివించాను. అది మాత్రం నన్ను చేరనిచ్చిందా? మొన్న శ్రావణంలో అది అత్తారింటికి వెళ్తుంటే 'నేనూ వచ్చి నీ దగ్గిర ఓ పదిరోజులుంటానే అమ్మాయీ!' అన్నాను. — 'ఎప్పుడో తీసికెళ్తాలే. ఇప్పుడు కాదు. మా అత్తగారూ వాళ్ళూ ఏమనుకుంటారో!' అంది నసుగుతూ. చెప్పొద్దూ? నాకు కోపం వచ్చింది. నేను రెండో కరాలిస్తున్నాను కదా? దాని అత్తగారి పెత్తనమేమిటి అంట? ఆ సరోజకే ఇష్టంలేదురా, నన్ను తీసికెళ్ళటానికి. నీపని ఇలా వుందా? అనుకున్నాను. ఈ ఏడాది పంట నేనే వుంచేసుకున్నాను. నేను పనికిరాని వాళ్ళకి నా సొమ్ము ఎలా పనికివస్తుందిరా? ఇక ఆ పొలం దానికి ఇవ్వను. నీకే." అనేసి ఊరుకొంది ఆవిడ. పద్మావతికికూడా అదేమంత సమంజసం అనిపించలేదు.

"ఐనా పెళ్ళిపందిట్లో పదిమంది వినగా చదివించావు, ఇప్పుడు మానేస్తే బావుండదులే పెద్దమ్మా! నేను తీసుకున్నా

నలుగురూ నవ్వుంటారు." అన్నాడు సారధి సావధానంగా, ఆండాళ్ళమ్మగారు ఖయ్యిమంది—"ఎవడ్రా నిన్ననేది? నాదగ్గిరికి రమ్మను. డొక్కచించి డోలుకట్టి వాడి చెవిదగ్గరే వాయిస్తాను. పళ్ళు పీకేస్తాను వెధనకి. ఏమైనాసరే ఆ పొలం నీకే ఇస్తాను, ఎవడంటాడో చూస్తాను."

"సరేలే పెద్దమ్మా! ఎండలోపడివచ్చావు కాస్సేపు పడుకో. ఇప్పుడెందుకీ గొడవలన్నీ?" అంటూ పెచ్చుపెరిగిపోతూన్న ఆండాళ్ళమ్మగారి ఆవేశానికి అడ్డువేశాడు సారధి.

"మరే నాయనా, చల్లనిమాట చెప్పావు. అలాగే పడుకుంటాను. కాయితాలపై భద్రం సుమా, అమ్మాయ్! పిల్లాడి గొలుసు కూడా భద్రంగా దాచుకో. పనిమనుష్షుల్ని గట్రా నమ్మకూడదు. దొంగ వెధవలు. ఏదీ, ఓచాప ఇలా పడెయ్ — నడుం వాలుస్తాను."

"కింద ఎందుకత్తయ్యా, గదిలో మంచం వేస్తాను. రండి." పద్మావతి లేచివెళ్ళి అత్తగారికి మెత్తటి పక్క తయారుచేసింది. మంచంమీద ఒరిగి అటూ ఇటూ దొర్లుతూ నిద్రలో మునిగిపోయింది ఆండాళ్ళమ్మగారు. సారధి తేలిగా వూపిరి వదిలాడు. పద్మావతి నెమ్మదిగా వచ్చి సారధిపక్కన కూచ్చుంది.

"ఎలా వుంది?" అన్నాడు.

"ఏమిటి?"

"అదే, నాకు పెద్దమ్మా — నీకు అత్తయ్యా ఆండాళ్ళమ్మా."

"అమాయకురాలు"

"అలాగా ?"

"కాళపోతే మీకు రెండెకరాలు రాస్తానంటుందేమిటి?"

"ఆవిడ అంటేమాత్రం మనకు బుద్ధిలేదూ?"

"బావుంది. ఆవిడక్కై ఆవిడే ఇస్తానంటే..."

సారథి బ్రహ్మాండంగా నవ్వాడు— "ఆహా, పద్మావతీ ! ఆడదాన్ననిపించుకున్నావ్ సుమా!"

పద్మావతికి పౌరుషం వచ్చింది—"ఆడపుటకపుట్టి ఆడదాన్ననిపించుకోకేం ?" అంది విసుగ్గా.

"అమ్మాయ్, నీకింత విసుగెందుకుగానీ నెమ్మదిగా ఆవిణ్ణి మంచిచేసుకో. ఆవిడకి బోలేడు నగ నట్రా వున్నాయట. అన్నీ నీకే ఇస్తుంది. ఎంతలేదన్నా ఓ చిన్ని మువ్వల వడ్డాణమైనా చేయిస్తుంది. ఇలాగే నువ్వెప్పుడన్నా కోప్పడితే తిరిగి తీసేసుకుంటు దనుకో." అన్నాడు నవ్వుతూ సారథి.

"నాకేం అక్కర్లేదు. నేనంత ఆశగొట్టుదాన్నేంకాదు." అంటూ రుసరుసలాడుతూ వెళ్ళిపోయింది పద్మావతి.

♦ ♦ ♦

ఆండాళ్ళమ్మగారు వచ్చి వారం రోజులైంది. ఆవారం రోజులూ ప్రశాంతంగానే గడిచాయి— "తుఫాను వచ్చే ముందు వాతావరణం ప్రశాంతంగా వుంటుందంటారు. ఇది అటువంటి ప్రశాంతత కాదుగదా కొంపదీసి, స్వంతకొంప కూడా కాదు. అదెకొంప." అనుకున్నాడు పార్థసారథి.

పద్మావతి బద్ధకించి పొద్దున్నే లేవలేకపోయినా ఆండాళ్ళమ్మగారే లేచి పనుల్లో జొరబడటం - పొయ్యిదగ్గర వంటదలో పని అంతా కోడలిపిల్ల సాయమైనా లేకుండా అత్తగారే చేసుకుపోవటం — రెండుపూటలా టిఫెన్లు (చేస్తూ చేస్తూ సగానికిపైగా రుచి చూసినా) లక్షణంగా చెయ్యటం— చంటి వాణ్ణి చంకనేసుకొని (వాడి చేతుల్లో అరడజను బిస్కట్లు పెట్టించుకొని) సాయంత్రాలప్పుడు పొరిగిళ్ళకు తిప్పుకురావటం- పార్థుడు ఇంట్లోలేని ఖాళీ సమయాలన్నీ అత్తా కోడళ్ళిద్దరూ కష్టం సుఖం — మంచీ చెడ్డా — పిచ్చా పాటీ చెప్పుకుంటూ సద్వినియోగ పర్చటం - మధ్యాహ్నం పూట కోడలికి నీతులు బోధిస్తూ (మొగుణ్ణి ఎలా లెక్క చెయ్యకుండా తిరిగి లొంగదీసుకోవాలో — జీతం డబ్బులు రాగానే తీసేసుకుని ఎలా దాచిపెట్టాలో గట్రా) నున్నగా తలదువ్వి గట్టిగా జడ వెయ్యటం (ఆ జడ పద్మావతికి ఎలా నచ్చుతుంది? అని అడగకండి. నచ్చుతుంది. అంతే) - నీ మంచికే చెప్తున్నానే తల్లీ, అంటూ అత్తగారు అడపా దడపా మందలిస్తూన్నా కోడలు పిల్ల మౌనంగా చిరునవ్వు మాత్రం నవ్వి ఊరుకోవటం (అత్తగారిని గౌరవిస్తున్నాను కదా అనుకొంటూ) ఇత్యాదులన్నీ ఆ ప్రశాంతతలోకే వస్తాయి- "ఎంచక్కా హాయిగావుంది" అనుకొంది పద్మావతి. "ఈవిణ్ని చేరదియ్యటం ఏ విధంగా చూసినా మంచికే సుమా!" అనికూడా అనుకొంది.

ఆ రోజు ఆఫీసునుంచి వచ్చిన పార్థసారధి భార్యామ కొంగుపట్టుకొని ఏదో కబుర్లుచెప్తూన్నవాడల్లా ఆండాళ్ళమ్మ గారి రాక ఆకళింపుచేసుకొని కొంగువదిలేశాడు. "అమ్మాయ్, పద్మావతి, బాబిగాణ్ణి తీసుకుని నేనలా శేషమ్మొదిన గారింటికి వెళ్ళొస్తాను. ఇల్లు భద్రం." అంటూ ఓసారి గది లోకి తొంగిచూసి వీధిలోకి వెళ్ళిపోయింది ఆండాళ్లమ్మగారు. సారధి బట్టలు మార్చుకుంటూంటే పద్మావతి ఫలహారం అమర్చింది, "ఈ వారంరోజులకే నాకు చాల కష్టంగా వుంది పద్మా!" అంటూ సారధి దగ్గరకొచ్చాడు.

"ఎందుకూ ?" అంది పద్మ అర్థంగాక.

"ఎందుకేమిటి! ఏమిటి ఖర్మ చెప్పు. ఈవిడ రాక ముందు ఎంత స్వేచ్ఛగా వుండేవాళ్లం. ఎవరో వస్తారనీ, ఎవరో చూస్తారని జంకూ గొంకూ లేకుండా—ఆడింది ఆటగా, పాడింది పాటగా. ఛా! ఆ సరదా ఎక్కడ? నువ్వసలే పైల పడ్డట్టు దూరదూరంగా తిరగటం ప్రారంభించావు."

"బావుంది. లేకపోతే ఆవిడ వుండగానే వచ్చి మీ ఒళ్ళో కూర్చోమంటావేమిటి?"

"అందుకే కదూ, నేను అఘోరించేది! ఏమిటీ ఖర్మ?"

"మీ శృంగారం సాగటం లేదనేగా ఈ వేదాంతం! ఆవిడవల్ల ఎంతసుఖంగా వుందో తెలుసా!

"నా మొహంలా వుంది. నీకు సుఖంగా వుండేమో; నాకేం లేదు. వెధవ తద్దినం తెచ్చిపెట్టావు."

"మీ అమ్మగారే వుంటే ఏం జేసే వారేమిటి ?"

"నిన్ను నాలుగు తన్నేవాణ్ణి; వెధవ తలతిరుగుడు లేకుండా."

"సారథి చిరాకు చూసి పద్మ నవ్వింది. "ఇప్పుడు నన్నేం చెయ్యమంటారు ?"

"ఆవిడతో జగడం వేసుకోరాదూ ! పోతుంది."

పద్మ విరగబడినవ్వింది. నవ్వుతూన్న పద్మ కళ్ళల్లోకి చూస్తూ అడిగాడు సారథి— "నిజం చెప్పు పద్మా ! ఎప్పుడూ లేనిది ఇలా దూరదూరంగా తిరుగుతోంటే నీకు బాధగా లేదూ ?"

పద్మ కళ్ళు దించుకుంది. "ఎందుకు లేదు? ఎలాగ సరిపెట్టుకోవాలి. మనం ఆడే ఆటలు నలుగురూవున్న కుటుంబాల్లో ఎక్కడా సాగవు."

"సాగేవాటిని కూడా ఆపుజేశావు. పైగా నీతులు నేర్పుతున్నావు. ఛ! నాకు ఇంటికి రావటం అంటేనే పూర్వంలా సరదా లేదు."

పద్మ క్షణం మౌనం వహించి "ఎందుకలా బెంగ? పోతారు ! ఆవిడ మీకు... రెండెకరాలూ బోలెడు రొఖ్ఖం ఇస్తానంది మరి" అంది హాస్యం చేస్తూ.

"నోరు మూద్దూ ! వెధవ ఎకరాలు ! రెండు కాదు. రెండు వందలిచ్చినా అమ్ముడుపోతానని మాత్రం అనుకోకు. ఒక్క నీ మాట కాదనలేక అంగీకరించాను, అనుభవిస్తున్నాను. అంతే."

3

సారధికి కోపం వచ్చిందని గ్రహించిన పద్మ నిజంగానే నోరు మూసుకొంది. సారధి ఫలహారం ముట్టకుండా వెళ్ళి కుర్చీలో కూర్చుని పేపరడ్డు పెట్టుకున్నాడు.

పద్మావతి చాలసేపు పల్కరిస్తాడేమోననీ, ఎదురు చూసి లాభంలేక, తనే వెళ్ళి పేపరు తీసేసి చేతులు పట్టు కొంది. సారధి కరిగి నీరై పద్మని దగ్గిరికి తీసుకుంటూ నవ్వే శాడు పద్మావతి మూతి ముడుచుకొంది— "మీ కసలు సిగ్గులేదు. ఇప్పుడేనా అలిగేరు! అప్పుడే నవ్వేస్తున్నారు!" అంది.

"అది నా తప్పు కాదు. భగవంతుడు నాకు సిగ్గుపెట్ట లేదు కావున్ను. నేనేం చేసేది?" అన్నాడు సారధి.

"మీకేం మాటలు రావుగనకా? పోనీగాని ఆ వుప్మా చల్లారిపోతూంది. తినేదేమైనా వుందా!"

"ఏమి టిలా రెండుపూటలూ ఫలహారాలూ, పిండి వంటలూ చేసేస్తున్నారు. నేనేమైపోవాలి? ఇప్పటికి అప్పాలూ సప్పలూ ఎరగను. ఇక అన్ని ఆనందాలూ చూపిస్తావు కాబోలు!"

"ఆవిడ చేస్తానని తయారవుతూంటే వద్దని ఎలా చెప్ప నేమిటి? ఏదో చూచాయగా అన్నా ఆవిడికి అర్థంకాదు."

"ఎందుకు కాదూ! అర్థం చేసుకోదు. ఇంతకీ నిన్ను మంచి చేసుకొంది. ఆవిడకేం లోటు?"

"ఎంతసేపూ ఆవిణ్ణి ఆడిపోసుకోవటమేగా మీ పని. సరి, ఉప్మా తిందురూ."

"ఈ రోజునుంచీ అన్నీ మునుపటిలాగే జరగాలి. నేనిలా దూరదూరంగా వుండలేను. ఎందుకు సాగదో చూస్తాను. ఉప్మా నువ్వే తినిపించు. తింటాను. లేకపోతే తీసికెళ్ళిపో."

"బావుంది వరస." అంటూ పద్మావతి స్పూన్‌తో ఉప్మా తీసి అందించింది.

"ఒసేవ్! పద్మావతీ! నీ కొడుకెంత అల్లరివాడయ్యాడే తల్లీ!" అంటూ లైన్ క్లియరింగ్ కోసం కాబోలు ఆండాళ్ళమ్మగారు అరుస్తూ రావటంతో శృంగారఘట్టం కాస్తా చెదిరిపోయింది. పార్థుడు కోపంతో వూగిపోతూ చేసేది లేక వుసూరుమన్నాడు.

♦ ♦ ♦

క్రమంగా సారథి అనే మాటల్లో నిజం వున్నట్లు అనుభవమవుతూ వచ్చింది పద్మావతికి కూడా. ఎప్పుడూ ఇద్దర్నీ ఒంటరిగా వుండనివ్వకుండా ఏవో కబుర్లేసుకొని కదలని రథంలా దగ్గిరే కూర్చుంటుంది ఆండాళ్ళమ్మగారు. సారథి సాయంత్రం ఇంటికొచ్చేసరికి తనదేదో పడిపోయినట్లు ఎక్కడ వున్నా పడుతూ లేస్తూ వచ్చి వీధిగడపలోనే ఎదురై పలుకరిస్తుంది. ఒక్కోసారి పూలుకూడా తనే అందుకొని ఎవరూ చూడకుండా మూతి విరుచుకొంటుంది. 'వంటా, వార్పూ చేస్తున్నాను. వడ్డన చెయ్యలేకపోవటమేం?' అని కాబోలు ఏపూటా తనే జబర్దస్తీగా సారథికి అన్నం వడ్డించి దగ్గిర కూర్చుంటుంది. ఆవిడ వచ్చాక బొత్తిగా పద్మావతికి సారథి దగ్గిర చేరటానికి వీలుకాకుండా పోయింది. పద్మచుట్టూ తిరు

గుతూ చంటిపిల్లవాడికన్నా ఎక్కువగా సారథి చేసే అల్లరి చల్లారిపోయింది. సారథి తరుచూ సాయంత్రాలు ఆలస్యంగా రావటం సాగించాడు. ఒకనాడు పద్మ అడిగింది :

"ఈమధ్య ఆలస్యంగా వస్తున్నారేం ?" అని.

అసలే చిరాగ్గా వున్న సారథి ఒక్కసారి విసుచుకు పడ్డాడు. — "ఆండాళ్ళమ్మని చూడ్డానికి కూడా తొందరగానే రావాలంటావ్ !" పద్మకు నవ్వొచ్చింది. జవాబు చెప్ప కుండా వూరుకొంది. — సారథి మళ్ళీ అన్నాడు — "నేను ఇంటికి వచ్చేసరికి నువ్వే ఎందుకు ఎదురు రావూ ?"

"బావుంది. ఆవిడ వీధి గదిలోనే చతికిలబడితే నేనేం చేసేది ?"

"ఊ...సరే ! ఈ రాత్రినుంచీ నాకు నువ్వే అన్నం పెట్టు. తెలిసిందా ?

"తెలిసింది. అన్నం పెట్టమని నన్నే పిలిచి చెప్పండి. తెలిసిందా ?" అంది పద్మ.

ఆరాత్రి సారథి స్నానం చేసి వస్తూ— "పద్మా, అన్నం వడ్డించు" అన్నాడు గట్టిగా. వెంటనే పద్మ వంటగదిలో కెళ్ళింది.

"నేను వడ్డిస్తాలేవే అమ్మాయ్ ! నువ్వు పిల్లవాణ్ణి చూసుకో." అంటూ ఆండాళ్ళమ్మగారు అపసోపాలు పడుతూ లేచి వచ్చింది వంట గదిలోకి.

"నిక్షేపంలా ఆడుకొంటూంటే వాణ్ణేం చూడాలీ? నేను వడ్డిస్తాలెండి. మీరు కాస్సేపు కూర్చోండి వాడి దగ్గర." అంది పద్మ పళ్ళెం కడుగుతూ.

"అయ్యో! నీ మొగుడికి నేనైతే సరిగా పెట్టనని భయమా ఏమిటె నీకు?" సిష్ఠూరంగా అనేసింది ఆండాళ్ళమ్మగారు.

"ఛ! అవేం మాటలత్తయ్యా! మీరు కాస్సేపు విశ్రాంతిగా కూర్చుంటారనిగానీ. పగలంతా ఏదో పని చేస్తూనే వుంటారుకదా?" అంటూ పళ్ళెం అక్కడ పెట్టేసింది పద్మావతి

"ఆఁ నాకలా ఖాళీగా కూర్చోవాలని వుండదే తల్లీ!" అంది ఆండాళ్ళమ్మగారు నడ్డనకు ఉపక్రమిస్తూ.

అంతా వింటూన్న సారథి — "అవును. నీకు ఎవరి ప్రాణాలైనా తియ్యాలని వుంటుంది" అనుకున్నాడు మంటగా.

ఏమీ ఎరగనట్టు — "పద్మా! అన్నం పెట్టావా!" అంటూ పొలికేక లేస్తూ వచ్చాడు వంటగదిలోకి.

"ఆ. ఆ. వడ్డించాను రారా! రోజూ నేను, వడ్డించటంలా? ఇవ్వాళ పెళ్ళాన్ని పిలుస్తున్నావ్ గానీ" అంటూ నవ్వేసింది ఆండాళ్ళమ్మగారు.



# 2

"అబ్బే! పెద్దదానివి, నిన్ను శ్రమపెట్టడం దేనికని..." నసుగుతూ పీటమీద కూర్చున్నాడు సారథి.

"ఏమిటో నాయనా! నువ్వు నాబిడ్డలాంటివాడివి. నా చేతుల్తో దగ్గరవుండి మరీ తినిపించా లనిపిస్తుంది." ప్రేమ గరిటెలతో తీసి మరీ వడ్డిస్తోంది ఆండాళ్ళమ్మగారు. పద్మ గదిలో కూర్చుంది గోళ్ళు గిల్లుకుంటూ. సారథికి పద్మను చూస్తే ఉస్సూరుమనిపించినా కోపం కెరటాలు వేసుకొంటూ వచ్చింది.

"నువ్వు వచ్చాకే పెద్దమ్మా! నమ్ము నమ్మకపో, నాలుగు మెతుకులు నోట పెడుతున్నాను. అదేమిటో దానికసలు వంటేరాదూ? పచ్చడి పులుసులా చేస్తుంది; పులుసు పాకంలా కాస్తుంది. పాకం..." కసిగా చెప్పుకుపోతున్నాడు సారథి.

"నమ్మకపోవటం ఏమిట్రా? నీ పెళ్ళాం మీద నువ్వే అబద్ధాలాడుకుంటావా ఏమిటి? పెళ్ళికీ ఇప్పటికీ ఎంత చిక్కిశల్యమైపోయావనీ! పాపం దానికి మాత్రం ఏమి తెలుసురా? కుర్ర సన్యాసి. ఇక బెంగెందుకులే, నేనున్నానుగా?" ఆండాళ్ళమ్మగారు వోదారుస్తుంటే సారథి నవ్వాడు. కాని పద్మ ముఖం ముడుచుకొంది. అది చూచి మరీ నవ్వాడు. పద్మావతి లేచి వెళ్ళిపోయింది. ఆండాళ్ళమ్మకూ పద్మావతికీ [illegible]లాట.

పెట్టాలనే ప్రయత్నంలో కొంచెం కొంచెం ముందుకు పోతున్నానా ? అనుకున్నాడు సారథి.

సారథి భోజనం అయ్యాక పద్మ ముభావంగా నాలుగు ముద్దలు మింగి వంటగది యావత్తూ అత్తగారికి అంకితం చేసి గదిలోకొచ్చి పెడమొహంగా కూర్చుంది. సారథి నెమ్మదిగా దగ్గర చేరాడు. "ఆండాళ్ళమ్మ చూశావూ నువ్వంటే ఎంత ప్రేమగా మాట్లాడుతూందో !"

పద్మ విసురుగా — "ఆవిణ్ణి అనుకోడం దేనికీ ? కాగు వెళ్ళి కడుగు ముంతలో దూరిందట. అసలువాళ్లే లోకువిస్తే పరాయివాళ్ళు అనటానికేం !" అంటూ మొహం తిప్పుకొంది.

సారథి నవ్వాడు పకా పకా. "చూడు పద్మావతీ ! నేను ఏది అన్నా హాస్యానికే అంటాననీ ఆండాళ్ళమ్మగారు నిజంగానే అంటుందని నీకు తెలుసు. నీకు తెలిసినా దాచుకొంటున్నావని నాకు తెలుసు. ఏమంటావ్?"

పద్మ ఏమీ అనలేదు. నిజంగా ఆండాళ్ళమ్మగారి మీద కోపం లేదు. ఆవిడ భోళాభోళీ మనిషనీ—అందుకే అన్నిటికీ సరదా పడుతుందనీ పద్మావతి ఉద్దేశ్యం.

సారథి పద్మ గడ్డం పుచ్చుకుని సహజమైన ధోరణిలో చెప్పసాగాడు— "పద్మా నిజంగా చెప్తున్నాను. భోజనం విషయం నాకు మరీ కష్టంగా వుంటోంది. ఏపూటా ఇద్దరం ఒక్కసారే కూర్చుని ఒక్క పళ్ళెంలో తిన్నట్టు తినేవాళ్ళం. ఛ ! రాను రాను, ఏం సరదా లేకుండా పోతోంది. నువ్వూ

కూడా ప్రక్కన కూర్చొని తినకపోతే నాకు ఏమిటో వెలితి కనీసం నువ్వో వడ్డించినా కొంత తృప్తి." పద్మ మాట్లాడ కుండా దిండులో తలదూర్చి పడుకొంది.

♦ ♦ ♦

లేచేసరికి కరకరా పొద్దెక్కింది. ఆండాళమ్మగారు కాఫీగిన్నె దించుతూ అప్పుడే లేచివస్తున్న పద్మావతి కేసి చుర చురా చూసి ప్రారంభించింది— "నీకు కోపం వస్తే చెప్ప లేనుగాని అమ్మాయ్! ఆడదానికిది లక్షణం కాదు. ఎం చక్కా తొలికోడి కూయగానే లేచి లక్షణంగా పాడీ పంటా చూచుకొని..." అంటూ. కమ్మటి నిద్రలో రాత్రివిషయం మరిచిపోయిన పద్మ చిన్నగా నవ్వుతూ అంది— "అంత పొద్దుటే లేచి ఎవరి పాడి కుండ తెచ్చి చెయ్యమంటా రత్తయ్యా?"

"ఇదేం చోద్యమే తల్లీ! పాడికుండ కాకపోతే మరో పనీ. ఆడదానికి ఒళ్ళు వంగాలేగాని సంసారంలో పనిపాటలే కరువవుతాయా? నీకు కోపం వస్తుందో ఏమో గానీ నేనైనా ఒకర్దాన్ని చెయ్యలేను సుమా" అంటూ నిలువు గ్లాసుతో డబుల్ స్ట్రాంగ్ కాఫీ తెచ్చుకుని గడపలో చతికిలబడింది ఆండాళమ్మగారు.

"కోపం ఎందుకత్తయ్యా? ఏమిటో ఆరుగంటలైనా మెలకువ రాదు. పాడు అలవాటైపోయింది" అంటూ పద్మా వతి అరచేతిలో పళ్ళపొడి ఒంపుకొని దొడ్లోకి వెళ్ళింది.

పొద్దున్నే లేవటం లేదనో—పనిపాటలు లక్షణంగా చేసుకోవటం రాదనో — మడిపంచె తెల్లగా పిండి పెట్ట లేదనో — అత్తలన్నా మొగుళ్ళన్నా యీ కాలం పిల్లలకు బొత్తుగా లక్ష్యం పాడూ లేదనో ఏదో ఒకటి ఎత్తి చూపించి వంకలెట్టి "మీమంచికే చెప్తున్నానే తల్లీ!" అంటూ మరీ సతాయించడం ఆండాళ్ళమ్మగారికి దాదాపు దినచర్యగానే వుంది. ఆదిలో చిన్న చిన్న చిరునవ్వులు విసిరేసి వూరుకునే పద్మావతికి అత్తగారి సాధింపులూ, హితవచనాలూ మిరియాల కషాయంలాగా, చేదు మాత్రలలాగా రకరకాలుగా — అని పించసాగాయి. రోజు రోజుకూ ఓమెట్టు పైకి జరుగుతూన్న అత్తగారి అలవాటు కోడలికి పొరపాటు అనిపించటం ప్రారంభ మైంది. అత్తగారి పరిపాటు కోడలికి గ్రహపాటులా కూడా తయారైంది.

'నా సంసారం మంచీ చెడ్డలు నాకు తెలీవేమిటి? ఏదో పెట్టి పోషిస్తున్నట్టు ఈ సాధింపు లేమిటి వెనక?' అని పద్మావతి లోలోపలే విసుక్కుని పైకి మొహం మాత్రం చిట్లించుకుని వూరుకొనేది. ఆండాళ్ళమ్మగారు ఎన్ని చదువు తున్నా సూటిగా జవాబు చెప్పడం పద్మావతికి ఇంకా ఒంట బట్టలేదు.

అటువంటి పరిస్థితుల్లో ఒకనాడు వంటగదిలో...

పద్మావతి అత్తగారికి సాయం చెయ్యటానికి దోస కాయలూ కత్తిపీటా ముందు వేసుకు కూర్చుంది. దోసకా యలు మొత్తబడి వున్నాయేమో సన్నగా ఉల్లిరేకులా పైపొర

చెక్కాలంటే వీలుగాక పెద్ద పెద్ద చెక్కులు తీసేసింది. అది చూచిన ఆండాళ్ళమ్మగారు "హారా !" అంటూ బుగ్గన వేలు ఆనించుకొని– "ఇదేం చోద్యమే తల్లీ! దోసకాయలు చెక్కడమే రాకపోవడానికి ఆడదానివి కావులే?" అంటూ ప్రారంభించి– "ఏం పెంపకాలో తల్లీ! ఆడపిల్ల లక్షణంగా పని పాటలు నేర్చుకోనద్దూ? కట్టుకున్నవాడైనా..." వరకూ చదివి తప్పంతా పద్మావతి తల్లిదే నని ఖచ్చితంగా తేల్చి వూరుకొంది. దారే పోయే అత్తగారు అప్పనంగా చేస్తూన్న అధార్టీకి పద్మావతికి ఆశ్చర్యమూ, అంతకుమించిన ఆగ్రహమూ కలిసి వచ్చాయి. "ఈ మాత్రం భాగ్యానికి ఎక్కడో వున్న పెద్దదాన్ని మాటలనటం ఎందుకూ? నా పని పాటలు గురించి మీ రింత బాధపడనక్కర్లేదు లెండి" అనేసి విసవిసా వెళ్ళి గదిలో మంచం మీద కూర్చుంది.

సారథి నెమ్మదిగా దగ్గర చేరాడు– "ఆండాళ్ళమ్మతో దెబ్బలాడావా ఏమిటే పద్మావతీ ?"

"బావుంది. ఆవిడతో నేనెందుకు దెబ్బలాడతానూ?

"అదే దోసకాయలేదో చేశావని సాధిస్తోందికదు ?"

"అంటే అంటుంది. చేతకానిపనులుచేస్తే అనరేమిటి?"

"అహ్హ హ్హ హ్హ !" అంటూ సారథుడు బ్రహ్మాండంగా, బ్రహ్మాండం బ్రద్దలయ్యేలా నవ్వాడు. "ఏం జరిగినా సహిస్తా నని ఇదవరకే చెప్పావ్ కదూ ? అక్షరాలా సహిస్తున్నావ్. నాదగ్గరా నీ దాపరికం పద్మావతీ? ఆ దారేపోయే అత్త గారికి ఇంతసేవ చేస్తున్నావుగాని ప్రయోజన మేమైనా ఉందా?

ఆ సేవలో ఆవగింజంతైనా పోని కందిగింజంతయినా నిన్ను కట్టుకొని – సదా నీ కొంగు పట్టుకొని నువ్వే సర్వస్వంగా భావించే – నిన్నే దేవతగా పూజించే..."

పద్మ లేచి రుసరుసలాడుతూ మళ్ళా వంటగదిలో కెళ్ళి పోయింది. సారథి హృదయం సంతోషంతో గంతులేసింది. "పద్మావతికీ, ఆండాళ్ళమ్మకూ యుద్ధం ప్రారంభమైంది. అది పరాకాష్ఠనందుకోటానికీ, ఆండాళమ్మ బయటకు నడవటానికీ ఇక ఎన్నోరోజులు పట్టదు. నిశ్చింతగావుండు సారా !" సారథి తనలో తాను పార్థుడి వీపు చరిచి ధైర్యం చెప్పుకున్నాడు. హుషారుగా ఈల వేశాడు. ఆ హుషారుతోటే సాయంత్రం మరీ తొందరగా ఇంటికి వచ్చేశాడు. వీధిగడపలో అడుగుపెట్టి లోపలికి చూపులు సారించాడు. ఒక్కసారి సారథి నడుం_లెదర్ బెలు పెట్టుకొనే వున్నప్పటికీ - పెళ్ళుమని విరిగిపోయింది ఆ అమితాశ్చర్య సంభరిత దృశ్యం ఒకేసారి చూచి మరి చూడ లేక కండ్లు మూసుకొని 'కుంటుకుంటూ లోపలికి నడిచాడు. ఆండాళమ్మగారూ పద్మావతీ నిజం అత్తాకోడళ్ళ లానే కల కలా కిలకిలా నవ్వేసుకుంటూ జోరున గవ్వలు గులకరించి పోస్తూ పచ్చీసు ఆడేసుకుంటున్నారు. సారథి ఉసూరుమంటూ కుర్చీలో కూలబడ్డాడు. పద్మావతి ఆట చాలించి లేచి వచ్చింది. నవ్వూనే నిండైన చేతులు సారథి మొహంమీద పెడుతూ..."గాజులు చూశారూ ? అత్తయ్య వేయించారు. గాజులవాడు వెళ్తూంటే పిలిచి వేయించుకోమని పట్టు పట్టారు.

వద్దంటున్నా వినిపించుకోకుండా డబ్బులు ఆవిడే యిచ్చారు. పాపం ఆవిడ చాలా మంచిదండీ! మనమంచికే అలా అంటుంది గానీ'' అంది.

"అయిందా నీసోది? ఆవిడా మంచిదే; నువ్వూ మంచి దానవే. అందరూ మంచివాళ్ళే. ఎటొచ్చీ నేనే కుళ్ళు వెధవను."

పద్మ తెల్లబోయింది. సారథి చాలా కోపంలో వున్నా డని గ్రహించి రెండు నిమిషాలు మౌనంగా నిలబడి మెల్లగా జారుకొంది.

ఓ అరగంటసేపు సారథి ఒక్కడే మౌనంగా గదిలో పచార్లు చేశాడు. ఆలోచనలు పరిపరివిధాల పరుగులెత్తాయి. "అమ్మ! ఆండాళమ్మా! ఎంత తెలివైనదానివి! నీ బుర్ర వెంటనే తీసి రష్యా పంపించాలి. పద్మతో వ్యవహారం బెడిసి కొడితే నీ ఆటలు సాగవని గాజులు వేయించి మంచి చేసు కున్నావా? సరేలే! దేనికైనా సమయం రావాలి'' అను కున్నాడు. శాంతంగా ఆలోచిస్తే .పద్మను అనవసరంగా కసిరానేమో ననిపించింది. పద్మతో కాస్సేపు కబుర్లేసు కోవాలనీ, లేకపోతే ఇద్దరూ ఎక్కడైనా తిరిగి రావాలనీ మనసు పోయింది. వెంటనే "పద్మా" అని పిలిచాడు. పద్మ మౌనంగా హాజరు పలికింది. సారథి దగ్గరికెళ్ళి పద్మావతి భుజంమీద చేయి వేశాడు.

"సినిమాకు వెళ్దామా?"

"ఇప్పుడా?"

"ఏం ? ఐదు నిమిషాల్లో రెడీ కాలేవూ ? బాబుని కూడా మీ అత్తగారి దగ్గర వుంచేసి మనం ఇద్దరం వెడదాం. మనం జంటగా వెళ్ళి చాలా రోజులైంది పద్మా !"

"ఆవిణ్ణి తీసుకెళ్ళకపోతే ఏమైనా అనుకోదూ ?"

"ఏమీ అనుకోదు. మొన్ననేగా అంతా వెళ్ళాం ! నువ్వు మాత్రం వెధవ తద్దినాలు పెట్టకు. తొందరగా తయారవ్వు."

"సరే ! చెప్పివస్తాను" అంటూ పద్మ లోపలి కెళ్ళింది. ఆవార్త కాస్త అత్తగారి చెవినివేసి "బాబును ఉంచండత్తయ్యా !" అంది. ఆండాళమ్మగారి జీవాలు తల్లడిల్లి కడంటి పోబోయాయి.

"అమ్మో ! నువ్వు లేకపోతే వాడు నాదగ్గర వుండడే తల్లీ !" అంది ఎంతమాత్రం వీల్లేనట్టు.

"మీకు బాగా చేరికైపోయాడని ఇందాకే కదా అన్నారత్తయ్యా ! పోనీలెండి. వాణ్ణికూడా తీసుకెళ్తాను" అంది పద్మ మామూలుగా. ఆండాళమ్మగారి హృదయం ఘోషపెడుతోంది. ఇంత అన్యాయమా ! ఇంటిల్లిపాదీ ఎంచక్కా సినిమా చూస్తారా ? తను ఇంటిదగ్గర పడి వుంటుందా ? వీల్లేదు. ఎంతమాత్రం వీల్లేదు.

"అయితే నన్నొక్కదాన్ని ఇంట్లో పడి వుండమంటావటే పద్మావతీ ? ఈ పాడు బస్తీలో ఎప్పుడేం జరుగుతుందో... ఏ దొంగ వెధవో కనిపెట్టి ఒక్కదాన్ని చేసి పీక పిసికేసినా ఇక్కడ నా కెవరే దిక్కు ?"

"ఛా! అటువంటి ఘోరాలెలా జరుగుతాయత్తయ్యా! ఇరుగు పొరుగు వాళ్ళు లేరూ ?"

"ఏమో తల్లీ ! నేనూ సినిమాకు వస్తానే! ఈ పాపిష్టి కళ్ళు పెట్టుకొని ఆ సినిమా అన్నా చూస్తాను. పుణ్యం పురు షార్థమూనూ."

ఆండాళమ్మగారు కడుపులో కోరిక కాస్తా బయట పడేసి ఉస్సురని నిట్టూర్చి గుడ్లప్పజెప్పి కూర్చుంది. పద్మా వతికి గొంతులో భోషాణం అడ్డుపడింది. ఈ సంగతి ఆయన గారితో ఎలా చెప్పాలి? ఎలానో చెప్పేసింది. "ఆవిడా వస్తుందట. ఒక్కతీ వుండలేదట. పాపిష్టి కళ్ళతో సినిమా అన్నా చూసి పుణ్యం సంపాదించుకొంటుందట. మీకు చెప్పాలనే వచ్చాను" అంది తన దోషమేమీ లేనట్టు.

సీరియస్‌గా అంతా విని తల తాటించాడు సారథి. "ఓహో! ఇప్పుడే అకస్మాత్తుగా ఆండాళమ్మకు పాపభీతి, దైవభక్తీ పుట్టుకొచ్చాయేమిటి ?" అని బయటికి వచ్చాడు. "నువ్వూ సినిమాకొస్తానన్నావట పెద్దమ్మా! ఇది పెద్దవాళ్ళు చూసే మంచి సినిమా కాదు పెద్దమ్మా! వెధవది. ఉత్తి పోకిరీ సినిమా! లేకపోతే నిన్ను తీసుకెళ్ళకుండా వెళ్తామా?" అన్నాడు శాయశక్తులా నటిస్తూ. "ఓ వారం రోజుల్లో 'ఏడేళ్ళశనీ', 'నెత్తిమీద తద్దినం' సినిమాలు వస్తున్నాయి అప్పుడు నిన్ను తీసుకెళ్తాను."

ఆండాళమ్మగారు అతి నిర్లక్ష్యంగా నవ్వేసింది. "నా మొహం. నాకేం మంచి చెడ్డలు కావాలిరా? చదువులా

సంధ్యలూ అన్నీ ఎరిగినవాళ్ళు మీరే చూడకాలేంది పిచ్చి ముండను నాకు మంచేమిట్రా ? ఏదో మీరు చూసేదే నాకు చూపించరా !"

సారథి మూతి బిగించుకొని మరీ పళ్ళు నూరుకున్నాడు. పద్మావతి కొంగు అడ్డుపెట్టుకొంది. "సినిమా వూని పారేద్దాం" అనిపించింది సారథికి వెధవది, ఇంత చిన్న విషయానికి ఆండాళ్ళమ్మదగ్గర తేలిపోవటం ఇష్టంలేక – "సరే! బయల్దేరండి" అనేసి చరచరా వెళ్ళిపోయాడు.

◆ ◆ ◆

"సినీమా బావుండదన్నావేంరా? ఎంచక్కా వుంటేనూ, ఆ శాంతమ్మతల్లి కాబట్టిరాకాసుల్లాంటి కోడళ్ళతో వేగగలిగింది" అంటూ మరునాటి వుదయం కాఫీ గుటక లేస్తూ రాత్రి చూచిన సినీమాను ఆండాళమ్మగారు ఒకటే మెచ్చువటం సాగించింది.

సారథి లేచివస్తూ—"ఈ ఆండాళమ్మ ఆ శాంతమ్మను మెచ్చుకుంటోంది పద్మావతీ !" అన్నాడు నెమ్మదిగా. పద్మ నవ్వి ఊరుకొంది.

సినిమా కబుర్లు దొర్లిపోతూంటే పార్థసారథికి టీపార్టీ ఆహ్వానం వచ్చింది. "చెల్లీ ! నువ్వూ బావగారూ నాలుగు గంటలకల్లా తప్పక రావాలమ్మా ! ఈసారి కూడా నన్ను నిరాశ పరిస్తే వూరుకోను మరి" అంటూ జబర్దస్తీగా ప్రాధేయపడి– "మర్చిపోకండి సుమా!" అంటూ ఓ పదిసార్లు హెచ్చరించి ఆ వచ్చిన మనిషి కాస్తా హడావిడిగా వెళ్ళిపోయాడు.

"పద్మా! ఈసారి వెళ్ళకపోతే మర్యాదగా వుండదు. మధ్యాహ్నం తొందరగా వచ్చేస్తా! మూడు గంటలకల్లా రెడీగా వుండు!" తువ్వాలు తీసుకొని స్నానానికి వెళ్ళి పోయాడు సారధి. పద్మావతి వంటగదిలోకి వెళ్ళింది. ఆండాళమ్మగారు నిండా దిగులుపడిపోయింది. కాఫీగ్లాసు పక్కనే పడేసి దిగులుగా కూర్చుండిపోయింది.

సారధి ఆఫీసుకు వెళ్ళిన తర్వాత కోడలిదగ్గర చేరింది. "అమ్మాయ్! పద్మావతీ! నేనుండగా నువ్వెందుకే చెయ్యి కాల్చుకుంటావూ? ఏ పుస్తకమో చదువుకుంటూ కూర్చోరాదూ? వంటా అదీ నే చూచుకుంటాను"

"అంతా పూర్తి అయిపోవచ్చిం దత్తయ్యా! ఎవరు చేస్తే ఏమిటి లెండి."

"అది సరేగాని అమ్మాయ్! సాయంత్రం ఎక్కడికే వెళ్ళాలంటున్నాడు పార్థుడూ?"

"ఇందాక వచ్చాడు కదూ ఒకాయన. ఆయన తమ్ముడి పెళ్లయింది. పెళ్ళికూతుర్ని తీసుకొచ్చారట. టీపార్టీ ఇస్తున్నారు."

ఆండాళమ్మగారు కాసేపు మౌనం వహించింది గానీ అంతకన్నా ఎక్కువసేపు వుండలేకపోయింది. "అమ్మాయ్! మీరు వెళ్ళేచోటుకు నేనూ రాకూడదేమిటే?" అనేసింది. కడుపు కాస్తా తేలికపడింది. పద్మావతి తెల్లబోయింది. ఏం చెప్పాలో తోచలేదు. కాస్సేపు ఆలోచించింది. "ఏమో అత్తయ్యా! ఆయన్ను రానివ్వండి అడుగుతాను" అంది.

"మాతల్లివే! అడుగమ్మా! అడుగు. ఏమిటో పెద్ద ముండను. ఈ పాపిష్టి కళ్ళతో పాపం పుణ్యం చూడాలని పిస్తుంది. మొన్న నోసారి సముద్రం చూపించావా? ఆ మహా గంగ చూచి ఎంత సంతోషపడిపోయాననీ! నిన్న సినిమా మాత్రం? ఎంచక్కా మంచీ చెడ్డా అన్నీ చూపించావు. పరాయిదాన్నయితే ఏం? స్వంత అత్తగారి కన్నా ప్రేమగా చూస్తున్నావు. ఇక నాకు నీకన్నా..."

ఆండాళమ్మగారు చదువుకుపోతూంటే — "పాపం! పెద్ద వయస్సు: అన్నీ చూడాలనిపిస్తుందేమో!" అనిపించింది పద్మావతికి.

సాయంత్రం నాలుగు గంటలకు ముందే సారథి వచ్చేశాడు "పద్మా! పదినిమిషాల్లో తెములాలిసుమా" అంటూ.

ఆండాళమ్మగారి కబురు అడగాలంటే తగని భయం వేసింది పద్మావతికి. కానీ వెనక ఆండాళమ్మగారు సైగలు చేస్తూంటే ఎలానో ధైర్యం కూడగట్టుకొని గదిలోకి వెళ్ళింది. "మీ పెద్దమ్మగారు కూడా వస్తుందటండీ! పొద్దుటినుంచీ నన్ను చంపుకు తింటోంది". గబ గబా అంతా చెప్పేసి ఊరుకుంది. సారథి చిత్రంగా చూశాడు. ఆ చూపు గ్రహించిన పద్మావతి — "నన్నేం చెయ్యమంటారు? మిమ్మల్ని అడుగుతానని చెప్పాను" అంది నెమ్మదిగా. సారథి కొంచం శాంతంగా ఆలోచించాడు. "ఆ, ఒకటి చెయ్! నేను చెప్తే బాగుండదు కానీ అక్కడ కిరస్తానీవాళ్ళూ తురకవాళ్ళూ ఇంకా వాళ్ళూ వీళ్ళూ బోలెడుమంది వుంటారట అని

చెప్పేయ్. మడి అంటే పడిచస్తుంది కదూ ?" అంటూ తెలివిగా ఉపాయం చెప్పాడు. పద్మావతి లోపలికెళ్ళేసరికి ఆండాళ్ళమ్మగారు కాచుకూర్చుంది. "అక్కడంతా కిరస్తానీవాళ్లూ వాళ్ళూ వీళ్ళూ వుంటారత్తయ్యా! మీరు రాకూడదంటున్నారు ఆయన" అంది నెమ్మదిగా పద్మావతి.

ఆండాళమ్మగారి గుండె గతుక్కుమంది. "ఎలా అత్తయ్యా! మీకు రావడానికి మీకు మడి కదా ?" అని అడిగింది పద్మ.

పాపం ఆండాళమ్మగారికి వెధవ మడీ దడీ కత్తుల్లా కనిపించసాగాయి. తన అంటూ సొంటూ వాళ్ళిద్దరికి తెలుసయ్యే ! వస్తానని ఎలా పట్టుపడుతుంది? పాపం ఆండాళమ్మగారు చారెడు మొహమూ అర్థణా బిళ్ళంతే చేసుకొని ఉసూరుమంటూ నిట్టూర్చింది. కానీ అటువంటి సమయాల్లోనే ఆండాళమ్మగారి బుర్ర అమోఘంగా పనిచేస్తూ వుంటుంది. "అయితే అమ్మాయ్! నేను రానుగానీ నువ్వు మాత్రం అటువంటి చోటుకు ఎలా వెళతావు ! ఛా! పాడు" అంది ఛీకొడుతూ.

"నేను వెళ్ళకపోతే ఆయన వూరుకోరత్తయ్యా!" అంది పద్మ తన అసహాయత వెల్లడిస్తూ.

"వూరుకోకేం చేస్తాడూ! నేను చెప్తాను. నువ్వు మాత్రం వెళ్లొద్దు" అంది ఖచ్చితంగా. పద్మావతి గడ్డకట్టినించుంది.

"పద్మా! అబ్బ! ఏమిటి నీ ఆలస్యం?" అంటూ వచ్చాడు సారథి.

"నీకు మతిపోయిందిరా? అటువంటిచోట్లకు దాన్నెల్లా తీసుకెళ్తావురా? పోనీ నువ్వు వెళ్ళిరా! మగవాడివి." సారథి వెళ్ళడానికి మాత్రం ఆజ్ఞ ఇస్తూంటే సారథికి నవ్వు వచ్చింది.

"అమ్మా! ఆండాళమ్మా! ఎత్తుకు పైయెత్తు వేశావా!" అనుకున్నాడు.

"ఆ మకేం ఫర్వాలేదు. వెళ్లకపోతే అమర్యాదగా వుంటుంది. వచ్చాక తలంటుకుంటుందిలే పద్మా! ఇంకా అలా నించుంటావేం బొమ్మలా? తొందరగా బయల్దేరే దేమైనా వుందా?" అంటూ పెళ్ళాంమీద విరుచుకుపడ్డాడు. గడ్డకట్టిన పద్మావతి కదిలి నడిచింది.

పద్మావతి ముస్తాబు చేసుకుంటూంటే గుడ్లు పెటుకు చూస్తూ కూర్చుంది ఆండాళమ్మగారు. చూడగా చూడగా ఆవిడకు కంపరం పుట్టింది. తగని కోపం వచ్చేసింది. "పిల్లవాణ్ణి కూడా తీసుకెళ్ళిపో అమ్మాయ్! ఆ గుంపులో గొలుసు భద్రంగా వుంటుందో లేదో తీసివేస్తాను" అంటూ లేచింది.

చొక్కా చేతులు మడతలు పెట్టుకుంటూన్న సారథి కలగజేసుకొని— "ఈ ఒక్కసారికీ నువ్వే వుంచాలి పెద్దమ్మా వాణ్ణి" అన్నాడు.

"నాదగ్గర వుండడురా నాయనా! లేకపోతే నాకేం బరువా; భారమా!"

"బిస్కట్లు పెడితే సరి. వాడే వుంటాడు" అంటూ అలమారులోంచి బిస్కట్ల డబ్బా తీసి కింద పడేశాడు సారథి.

చూస్తూ చూస్తూ వుండగానే పార్థసారథీ, పద్మావతీ సింగారించుకుని చెట్టాపట్టాలేసుకొని వీధిలోకి వెళ్ళిపోయారు.

'హతోస్మి!' ఆండాళమ్మగారు ఓడిపోయింది. కసిగా పిల్లవాణ్ణి కింద కుదేసి ఒక్క విసురున బిస్కట్ల డబ్బా ముందుకు లాక్కుని కూర్చుంది.

భార్యామణితో జంటగా వీధిలో పడ్డ పార్థసారథి వేయిగండాలు దాటి వచ్చినట్లు గాలి వదిలాడు. "హమ్మయ్య! ఆండాళమ్మను జయించగలిగాను. వచ్చేవరకూ వస్తామంటే నమ్మకం లేదు. ఇవ్వాళైనా ఆ పార్టీ చూచుకుని అలా బీచ్‌కి పోయి కాస్సేపు తిరిగివద్దాం."

"ఆలస్యంగా వెళ్తే ఆవిడేం గొడవ పెడుతుందో!"

"ఆమాటా నిజమే. ఆండాళమ్మను తేలిగ్గా తీసి పారెయ్యటానికి వీల్లేదు. ఏమిటో అనుకున్నాను గానీ ఆండాళమ్మ బుర్ర మహా చురుకైంది. అటువంటి వాళ్ళకే కీలెరిగి వాత వేస్తూండాలి."

దంపతులిద్దరు పార్టీకి హాజరై అటు తర్వాత బీచ్‌లో ఓ గంటగడిపి నిబ్బరంగా ఇంటికి జేరేసరికి తొమ్మిదిదాటింది. బాబు నిద్రపోతున్నాడు. వీధి తలుపులు తీసి వెళ్ళి ముసుగు తన్ని పడుకుంది ఆండాళమ్మగారు. పద్మ కంగారుగా అడిగింది— "అదేం అత్తయ్యా? ముసుగుపెట్టుకు పడుకున్నారుః"

"నాకు ఒంట్లో బావులేదే తల్లీ! అందుకే వంట చెయ్యలేదు. చేసుకో" అనేసి అటు తిరిగిపోయింది ఆండాళ్ళమ్మగారు. పద్మ అత్తగారి ఒంటిమీద చెయ్యివేసి చూచింది: వేడే లేదు.

"ఏమీ లేదు. అంతా నటన" అనుకుంది పద్మ.

"నన్ను పరీక్ష చేస్తున్నావుటే? అబద్ధాలాడుతున్నానా?" అంది ఆండాళ్ళమ్మగారు నిష్ఠూరంగా. పద్మ మాట్లాడకుండా లోపలి కెళ్ళింది. బిస్కట్టు డబ్బా కాలికి తగిలితే తీసి అలమారులో పెట్టబోయింది. అందులో మరి అయిదారు బిస్కట్లు మాత్రం మిగిలివున్నాయి. పద్మావతి విస్తుబోయింది. క్రిందటి రోజే సీలు తీసిన డబ్బా! వెళ్ళేసరికి నిండుగా వుంది. అన్నీ బాబు తినేశాడా?

"ఛా! ఏం మనిషి!" అనిపించింది మొట్టమొదటి సారిగా పద్మావతికి ఆండాళ్ళమ్మగారిని గురించి. ఆ డబ్బా పట్టుకొని సారథి దగ్గర కెళ్ళింది. "చూశారా? మనం తీసుకెళ్ళలేదని కోపం వచ్చింది కాబోలు. ముసుగు బిగించి పడుకుంది. వంటాగింటా ఏం చెయ్యలేదు. పైపెచ్చు బిస్కట్లన్నీ తినేసింది. పిల్లాడు తిన్నాడంటే నమ్మేస్తామనుకుంది కాబోలు." పద్మావతి ఆండాళ్ళమ్మగారి చేష్టలు వర్ణిస్తూంటే అవి పార్థుడి చెవులకు కృష్ణలీలలుగా సోకుతున్నాయి. తన్మయత్వంలో మునిగి, సానబెట్టిన రత్నంవంటి ఉపదేశం ఒకటి చేశాడు—"పద్మావతీ! ఇప్పుడిప్పుడే నీకు జ్ఞానోదయం అగుచున్నది. త్వరలోనే నిజము తెలుసుకొన గలవు. వెంటనే వెళ్ళి వంట చేసుకొనుము."

"మీరూ సరే!" అంటూ వెళ్ళిపోయి బట్టలు మార్చు కొని వంటలోకి దిగింది పద్మావతి. చేటలో బియ్యం కను పించలేదు సరి కదా వాటి స్థానే ఓ అరవీశెడు పుచ్చు వంకా యలు ప్రత్యక్షమయ్యాయి— "అత్తయ్యా! వంకాయలు మీరు కొన్నారా? చేటలో మధ్యాహ్నం పెరివుంచిన బియ్యం కనుపించటం లేదేం?" అంది అత్తగారి దగ్గరకెళ్ళి.

"మంచి వంకాయలు వస్తేనూ వదిలిపెట్టలేక బియ్యం యిచ్చి కొన్నానే" అంది ఆండాళమ్మ ముసుగులోంచే.

పద్మ విస్తుపోయింది. "ఏమిటీ! మూడు తవ్వాల బియ్యం పోసి అరవీశడు పుచ్చువంకాయలు కొన్నారా!" అంది విసురుగా.

ఆండాళమ్మగారు దిగ్గున లేచి కూర్చుని— "మూడు తవ్వ లెక్కడున్నాయే! శేరుకూడా లేవు. ఈ కాలంలో వంకాయల ధర ఎక్కువ కాదూ? అర్థవీశకూ అర్థరూపాయి కట్టి శేరు బియ్యం ఇచ్చాను. పుచ్చులంటావేం? నిక్షేపంలా వుంటేనూ?" అంది.

పద్మకు నిజంగానే కోపం వచ్చింది. "శేరు బియ్యం వుండటం ఏమిటి? ఈ పూటకూ రేపొద్దుటికీ వుంటాయని నా చేతుల్తో నేను మధ్యాహ్నం మూడు తవ్వాలు బియ్యం పెరి వుంచాను" అంది నిక్కచ్చిగా.

"అయితే ఆ తవ్వెడూ నేను అమ్ముకున్నానంటా వేమిటే? దొంగతనాలు కూడా కడుతున్నావుటే తల్లీ!

హామ్యో రామా!" అంటూ గొంతు శ్రుతిచేసుకోబోయింది ఆండాళమ్మగారు. ఈ భాగవతమంతా సారధిగాని వింటే చీవాట్లు పెడతాడని నోరు మూసుకొని వంటగదిలో కెళ్ళిపోయింది పద్మ. "మనిషిని నమ్మి ఒక్కపూట ఇంట్లో వుంచివెళ్తే ఎంత పనిచేసిందీ! బియ్యం అన్నీ ఏ కూరల మనిషికో అమ్మేసింది. పైగా దొంగతనం కడతావా? అంటూ రాగాలు తీస్తోంది. ఇటువంటి మనిషిని నమ్మి వుంటే ఇంకేమైనా వుందా? అనుతుంది వంటచేస్తూ.

కాస్సేపటికి ఆండాళమ్మగారు లేచి వచ్చింది వంట గదిలోకి. తనకు తనే కలుగజేసుకొని కోడలిని పలకరించింది. "అక్కడ మీకు ఏమేం పెట్టారేమిటే అమ్మాయ్? ఆ పార్టీ అదీ బాగా జరిగిందా?" అంటూ చతికిలబడింది. "ఆ! అంతా బాగానే జరిగింది. మైసూరుపాకులూ, జిలేబీ, కారం బూందీ పెట్టి టీ యిచ్చారు" అంది పద్మ ముభావంగా అన్నం వారుస్తూ. కాస్సేపు కూర్చుని "సరేనమ్మా, కూర్చో లేకపోతున్నాను. వెళ్ళి పడుకుంటాను" అంటూ మాడ్చుకున్న మొహంతో గదిలోకి వెళ్ళిపోయింది ఆండాళమ్మగారు.

వంట అయ్యేసరికి పది దాటింది. సారధి భోజనం కాగానే అత్తగార్ని లేపింది పద్మావతి — "పొద్దుపోయింది భోంచేద్దాం రండి" అంటూ.

"నాకు ఒద్దులేవే తల్లీ! మీ రిద్దరూ భోంచెయ్యండి" అంది ఆవిడ.

"అదేమిటత్తయ్యా! కాస్త నలతగా వుంటే మాత్రం అన్నం మానేస్తే నీరసం రాదూ? లేవండి, భోంచేద్దాం. మీ అబ్బాయి తినేశారు" అంది పద్మ.

"అబ్బే! నేను తిననమ్మాయ్" అంటూ ఎంత చెప్పినా ఆండాళమ్మగారు అన్న తిననని కూర్చుంది. చేసేదిలేక పద్మావతి సారథి దగ్గరికెళ్ళి అంతా వివరించి చెప్పి — "ఇదేం ఖర్మండీ? నిండు ఇంటిలో పస్తు పడుకుంటాననటుందీ!" అంటూ విసుక్కుంది. సారథి చిరునవ్వు నవ్వాడు. పద్మ ఒంటినిండా చీమలు పరుగెత్తాయి.

"భయపడకు పద్మావతీ! అసలు రహస్యం నీవు గ్రహింపవైతివి. రమ్మ నావెంట" అంటూ పోజుగా బయల్దేరాడు.

"పెద్దమ్మా! భోంచెయ్యవూ? దారేవస్తూ నీకో అరవీశెడు జిలేబీ కొందామనుకునే మర్చిపోయాను సుమా? రేపు తప్పకుండా తెస్తాన్లే. ఇప్పటికే పదకొండు కావస్తోంది. లేచి భోంచెయ్యండి" అన్నాడు.

నాగస్వరం వినపడ్డ కొండచిలువమల్లే ఆండాళమ్మగారు నెమ్మదిగా కదిలి ముప్పటి తీసేసి లేచి కూర్చుంది. "అయ్యో! నీ పిచ్చి దొంగల్దోలా! నేనేం చిన్నపిల్లనుట్రా? జిలేబీలూ అవీ తినటానికి" అంది.

"పెద్దవాళ్ళు చిన్నపిల్లలతోనే సమానమంటారులే పెద్దమ్మా! మరి లేచి వెళ్ళు. పద్మ వడ్డిస్తోంది."

"తింటాలేరా! తిండికేమొచ్చె! కొడుకులాంటి వాడి వని నీతో అంటున్నానుగానీ నిజంగా జిలేబీ అంటే మహా యిష్టం సుమా నాకు" అంది ఆండాళమ్మగారు వరదత్తై పారుతున్న లాలాజలం గుటకలేస్తూ.

"కాదూ మరి?" పైకి అని — "నీకు విషంకూడా ఇష్టమైతే ఎంత బావుండును!" అనుకున్నాడు సారథి. ఆండాళమ్మగారు లక్షణంగా లేచి పీటమీద కూర్చుంది. అసలు రహస్యం తెలుసుకున్న పద్మావతి విస్తుపోయింది. ఆండాళమ్మగారు అన్నం తింటూన్నంతసేపూ అన్నం మేకుల్లా వుందనీ; కూర కారం వాసన కొడుతోందనీ సాధిస్తూనే వుంది. ఆవిడ ధోరణికి చిరాకనిపించి జవాబు కూడా చెప్పకుండా గబగబా నాలుగు ముద్దలు మింగి వంటగది సర్ది గదిలోకి పోయి మంచంమీద కూర్చుంది పద్మ.

"మనిషి హద్దులు మీరుతున్నట్టు వుంది."

"సహిస్తా నన్నానవ్."

"బావుంది. నోటి కొచ్చినంతా వాగుతూంటే కూడానా?"

"సరేలే. వింటుంది."

"అవును. చాటుమాటుగా వినే గుణంకూడా వుంది."

సారథి కంఠస్వరం హెచ్చించాడు. "అలా గుసగుసలాడితే బయట కష్టపడి వింటూన్న వాళ్ళకేమైనా వినపడాలంటావా? కాస్త గట్టిగా చెప్పలేవూ?"

పద్మ బిత్తరపోయింది. తలుపువెనక నిలబడిన ఆండాళమ్మ అదిరిపడి పిల్లిలా జారుకొంది. తేరుకుని పద్మ విరగబడి నవ్వింది.

మర్నాడు సారథి ఆఫీసుకెళ్తూంటే ఆండాళమ్మగారు వెనకే వచ్చి సాగనంపుతూ— "అబ్బాయ్! రాత్రి జిలేబీ తెస్తానన్నావ్ కాదూ. చూడూ! ఆ పొట్లాంలోనే ఓ మైసూర్‌పాక్ ముక్క కూడా కట్టించుకొస్తావ్రా!" అంది నెమ్మదిగా.

"ఓ రెండు జీళ్ళుకూడా తెస్తాను" అంటూ మెట్లు దిగాడు సారథి.

సాయంత్రం సారథి ఆఫీసునుంచి వచ్చేవేళకు వీధి గుమ్మం కాసింది ఆండాళమ్మగారు. సారథి వస్తూనే రెండు పొట్లాలు ఆవిడచేతిలో పెట్టాడు. "అదేమిట్రా" అంటూ మూడోదాన్ని ఆరాతీసింది.

"పద్మకు పూలులే" అన్నాడు సారథి.

"ఆఁ నీకేం మతిపోయిందేవిట్రా? ఏదో పండక్కూ, పబ్బానికీ గానీ రోజూ భోగంవాళ్లా పూలు సింగారించుకోవటం ఏమిటి? రోజుకు అణా అయితే మాత్రం నెలకు రెండు రూపాయలు కావ్రా? ఏ మజ్జిగనీళ్ళకైనా వస్తాయి."

పూలు అందుకోవాలని వస్తూన్న పద్మ అత్తగారి మాటలు విని ఆగిపోయింది. "మీరు బాధపడిపోవడానికి మీ సంపాదనేం చిల్లుకానీ బీసుపోవటం లేదులెండి" అంది విసురుగా వెనకనుంచే.

ఆండాళమ్మగారు వెనక్కు తిరిగిచూసి నవ్వేస్తూ—"అయ్యో ! కోపం తెచ్చుకుంటున్నావేమిటే అమ్మాయీ ? దుబారా ఎందుకని నీ సంసారం మంచికే అన్నాను సుమా ! పూలు నీకంత యిష్టమైతే అలానే పెట్టుకోవే తల్లీ ! రోజూ దానికి పూలు తెచ్చిపెట్టరా పార్థుడూ !" అనేసి పాట్లాలు తీసుకొని పెరట్లోకి వెళ్ళిపోయింది.

ఆండాళమ్మగారి రంగులు కళ్ళారా చూస్తూ సారథి, పద్మ ఆశ్చర్యంతో అయోమయంగా వుండిపోయారు. ముందుగా నికి సారథి తేరుకుని "పద్మా ! పూలు తీసుకెళ్ళు" అన్నాడు.

"నాకేం అక్కర్లేదు" అంటూ విసురుగా గదిలోకి వెళ్ళిపోయింది పద్మ.

"బావుంది. నామీా దేమిటి నీ అలక ?" అంటూ సారథి వెనకే వెళ్ళాడు.

"నా కెవరిమీాదా అలకలేదు."

"నువ్వేలాగూ అలుగుతావని తెలిసే కట్టిన పూలు తీసుకొచ్చాను" అంటూ మాల తనే పద్మ జడలో సర్దేశాడు. "ఆండాళమ్మ ఎటువంటిదో తెలిసి కూడా ఆవిడ మాటలు పట్టించుకొంటున్నావా పద్మా !" అంటూ అనునయంగా మందలించాడు.

సారథి పట్ల పద్మకు నిండు నమ్మకముంది. అయినా యిలా చెప్పుడు మాటలు ప్రారంభిస్తే ఏమవుతుందో ఎవరు చెప్పగలరు ? "ఛా ! ఇంత చెడ్డ మనిషా ఆండాళమ్మ ?"

అనిపించింది పద్మకు. ఆ క్షణంలో ఆండాళమ్మగారంటే ఒక రకమైన విముఖత్వం ప్రారంభమైంది.

"బుద్ధి తక్కువదాన్ని. నేను పట్టుబడితే మాత్రం మీరు ఖచ్చితంగా ఆవిడను తీసుకురావటానికి వీల్లేదని చెప్పెయ్యకూడదూ? చెప్పేవాడికి చాదస్తమైతే వినేవాడికైనా వివేకం వుండాలట" అంటూ తప్పు అంతా సారథి మీదే నెంటివేసింది పద్మావతి. "భగవాన్! ఆఖరికి తప్పు నాదేనా? ఏం? పెద్ద దిక్కు వుంటె కష్టానికీ—సుఖానికీ—మంచికీ—చెడ్డకూ..."

"నా మొహానికీ—ఈవిడింత చిత్రమైన మనిషని నాకేం తెలుసు?"

"పోనీలే. ఇది మనకో అనుభవం" అన్నాడు సారథి తేలిగ్గా.

అత్తా కోడళ్ళిద్దరూ ఎడమొహం పెడమొహంగా తిరుగుతూంటే సారథికి కనులపండువుగా చూడ ముచ్చటగా వుంది. "ఏడుకొండలవాడా! వెంకటరమణా! గో...విందా! గోహోవిందా! ఆండాళమ్మకూ పద్మావతికీ పేద్ద జగడం వస్తే మా బాబిగాడి జుట్టంతా నీ ఎదటే గీయించి నున్నగా బొప్పణం చేయించేస్తాను. తర్వాత మా పద్మావతిచేత మూడు గుప్పెళ్ళ డబ్బులు నీ డబ్బాలో పోయిస్తాను. నేను నా చేతుల్తో పది కొబ్బరికాయలు ధన్‌ధనామంటూ చితగ్గొట్టేస్తాను. ఆపద మొక్కులవాడా! మా ఇంట్లో ఒక లావు

పాటి ఆపదమ్మ బైటాయించింది. అందుకే నీకు మొక్కు కుంటున్నాను ప్రభో!" అంటూ వడ్డీ కాసులవాడి పటం దగ్గరచేరి మొరపెట్టుకున్నాడు సారథి.

♦ ♦ ♦

పద్మావతి ఆండాళమ్మగారితో మాట్లాడకుండా ఒకటి రెండు రోజులు ముభావంగా తిరిగింది గానీ కోపాలూ కావేష్యాలూ కలకాలం వుండవుగా? అన్నీ మరిచి నిత్యకృత్యాల్లో పడిపోయింది.

ఓనాటి సాయంత్రం ఆఫీసునుంచి వచ్చి ఫలహారం కానిచ్చి ఏదో పుస్తకం తెరచుకొని కూర్చున్నాడు సారథి.

"మహా తీరిగ్గా కూర్చున్నారుగానీ కూరలేమీ లేవు. బజారు కెళ్ళి రావొచ్చు" అంటూ సంచి తెచ్చిపడేసి ఆజ్ఞాపించింది భార్యామణి.

"ఇప్పుడా ?" అన్నాడు సారథి పుస్తకం వదల్లేక.

"ఆ ఇప్పుడే. ఏం ? ఈ పూట అన్నం అక్కర్లేదా?"

"పస్తుకూడా వుంచుతావేం ఖర్మ! సరే! ఓ రెండు రూపాయలు..."

"రెండెందుకూ ? ఒకటి ఇస్తున్నాను. చాలు. అదీ పూర్తిగా తగలేసుకు రాకండి. ఓ వీశడు వంకాయలూ— ఓ వీశడు బీరకాయలూ చాలు" అంటూ ఒక్క రూపాయి నోటు అందించింది.

"మరైతే... మరి..." బుర్ర గోక్కుంటూ నిలబడ్డాడు సారథి.

"ఏమిటి మరి ?"

"ఓ సిగరెట్టు కాల్చుకుంటాను."

"సక్షేపంలా కాల్చుకోండి."

"కాదూ ! ఈ రూపాయిలోదే ఒక అర్థణా పెట్టి..."

"కొంటారు. అంతేనా ?"

"కనిపెట్టేశావే !"

"అదేం కుదరదు. ఇంట్లో టిన్ను వుండగా మళ్ళా డబ్బులు తగలేసి కొంటారేం ?"

సారథి బిక్కముఖం వేసుకున్నాడు. "ఇంట్లోదే తీసుకెళ్ళి బయట కాల్చుకుంటారేమిటి ? ఏంచక్కా బజార్లోనే కొనుక్కుంటే..."

పాపం పద్మావతి హృదయం జాలితో నిండి పొర్లిపోయింది— "సరే ! తొందరగా వచ్చెయ్యండి" అంటూ ఒక అర్థణా మాత్రం ఖర్చుపెట్టుకోవటానికి అనుమతించింది. సారథి "ఓ" అంటూ హుషారుగా ఈలవేసుకుంటూ వెళ్ళిపోయాడు. వీధి తలుపులు వేసి నవ్వుకుంటూ వస్తూన్న పద్మావతికి ఆండాళమ్మగారు బుగ్గలు నొక్కుకుంటూ ఎదురుపడింది. "ఇదేం చోద్యమే తల్లీ ! నీ ముందు వాడు గడగడలాడిపోతాడేం ? సిగరెట్టు ముక్క కొనుక్కోవడానికి కూడా నీ ఆర్డరే కావాలా వాడికి ?" అంటూ విస్తుపోయింది.

"అదంతా నాటకం అత్తయ్యా ! మీరు నమ్మేశారేమిటి ?"

"ఏమో తల్లీ ! ఈ కాలం పిల్లలు మొగుళ్ళను కొంగులకే ముడివేసుకుని కోతులను ఆడించినట్టు ఆడించుకొంటున్నారు. మా కాలంలో మొగుడనేసరికి గుండెలు దడదడలాడటం..." పద్మ నవ్వుతూ విసాగింది.

ఓ గంటలో సారధి బజారునుంచి వచ్చాడు. ఖర్చు వివరాలు తెలియజేశాడు— "వంకాయలు అరణాలు—దోసకాయలేమో పావలా—పదణాలైపోయాయా? రూపాయినోటు కదూ, ఇచ్చావ్నూ? ఇంక అరణాలా? ఇంద పావలా" అంటూ పావలాబిళ్ళ పద్మ చేతిలో ఎత్తిపడేశాడు.

"వంకాయలు అరణాలా? మొన్న నేను బేడకే కొన్నానూ" అంది పద్మావతి డిటెక్టివ్‌లా ఆరాలు తీస్తూ.

"నయం. అర్థణాకే కొన్నానన్నావు కాదు. ఇది మీ బొమ్మిడి కాదు అమ్మాయ్! విశాఖపట్నం. ఇక్కడ బేడ చూపిస్తే వంకాయ బొమ్మకూడా ఇవ్వరు."

"ఓహో! వంకాయ బొమ్మ యిక్కడ మూడణాలుంటుందంటా రేమిటి!"

"అరణాలూ వుంటుంది?"

"సరే! లెక్క కానివ్వండి స్వామీ, మిగతా బేడ ఏమైందీ?"

"బేడా?...మరేమోనూ...బేడేనా ?"

"ఆ. బేడే."

"ఒక స్నేహితుడు కనపడ్డాడే...నన్ను చూశాడే... దగ్గరికి రమ్మన్నాడే ... ఒక స్నేహితుడు కనపడ్డాడే ... పిలిచాడే..."

"అబ్బబ్బ! ఇంతకూ ఏం చేశాడండీ ఆ స్నేహితుడూ?"

"చాలా కష్టాల్లో వున్నాడే..."

"ఎందులో వున్నాడూ, కష్టాల్లోనా?"

"ఆ. చాలా కష్టాల్లో వున్నాడే."

"మీరు చూశారా కష్టాల్లో వుండటం?"

"లేదే. వాడు బజారు కొచ్చాడు. కష్టాలేమో ఇంటి దగ్గరే వున్నాయట. వాడే చెప్పాడే. చాలా కష్టాల్లో వున్నానూ, ఏమైనా అప్పు ఇస్తావా? అని అడిగాడే... మరి నా మనసు కరిగిపోయిందే."

"మనసంతా కరిగిపోయిందా?"

"కొంచెం కొంచెం కరగటం మొదలుపెట్టిందే. అసలే నా మనసు బోలెడు విశాలం. వారం రోజులకి గానీ పూర్తిగా కరగదు."

"ఆహా! అంత విశాలమా? అయితే ఏంచక్కా అందులో రెండు డాబాలు కట్టించుకోకూడదూ? ఒకటి అద్దె కిచ్చి మరో దాంట్లో మనం వుండవచ్చు. ఈ అద్దె కొంపలో బాధ దేనికీ?"

"నేనూ అదే ఆలోచిస్తూంటాను సుమా! చోటు అయితే ఎన్ని డాబాలు కట్టటానికైనా వుంటుందనుకో. మరి పెట్టుబడి?... ఒకటి చేస్తావేమిటి? మీ అన్నను మనకో పదివేలు సర్దమనూ. మనం కావలసినంత చోటు ముదరా ఇద్దాం. ఎలావుంది?"

"అమోఘంగా వుంది. ఆ విషయం తర్వాత ఆలోచిస్తాను. ముందు ఆ బేడ మాట చెప్పండి."

"చెప్పాను కదే! స్నేహితుడు చాలా కష్టాల్లో వున్నాడనీ."

"అయితే అతనికి ఆ బేడ అప్పిచ్చారా?"

"అమ్మో! బేడ ఇస్తానా? నువ్వు తిట్టవూ? ఓ అణా ఇచ్చానే."

"ఓహో! చాలా కష్టాల్లో వున్న స్నేహితుడికి అణా సర్దారా? అదీ అప్పిచ్చారు. నిజంగా ఎంత విశాలమండీ మీ మనసు? అందులో వెధవది డాబా లేమిటి? థియేటర్లూ— ప్రాజెక్టులూ—యూనివరిసిటీలూ—కాఫీహోటళ్ళూ— సర్వాం కట్టి తీరాలి."

"ఇప్పటికి సరిగ్గా గ్రహించావు."

"సరే! మిగతా అణా?

"మరి నువ్వు అర్థణా పెట్టి సిగరెట్లు కొనుక్కో—మనలా?"

"సరే! అర్థణా?"

"అర్థణాయా? అబద్ధం ఎందుకూ? చెప్పనా? సోడా తాగానే."

"ఎందుకూ?"

"సోడా తాగకపోతే వంకాయ లపీ ఇవ్వనన్నాడే మరి."

"ఓహో!" కూరలవాడే సోడా షాపుకూడా పెట్టాడన్నమాట."

"మరే! ఇప్పుడంతా ఇలాగే జాయింటు షాపులు పెడుతున్నారు. వెధవది, ఒక వీశెడు కూరగాయలు కొనాలంటే ఒక సోడా తాగాలి."

"అవునవును. మీరు రెండు వీశెలు కొన్నారు కాబట్టి కిళ్ళీ కూడా వేసుకోవాలి."

"రామ! రామ! నేను కిళ్ళీ వేసుకున్నానా?"

"లేకపోతే పెదాలలా ఎర్రగా వున్నాయేం?"

"ఓ! అదా! నా పెదాలెప్పుడూ ఎర్రగా దొండపండ్లలాగే వుంటాయి."

"అవును. బొత్తిగా సిగరెట్లు మొహం ఎరుగరు కదూ? సిగ్గు లేకపోతే సరి. బజారు కెళ్ళి రావటానికి బేడ లంచం! పైగా మీహృదయం చదరపుమైళ్ళకొద్దీ విశాలం. అవునా?"

సారధి బిక్క మొహం వేసుకు నించున్నాడు. పద్మ కూరలు లోపలికి తీసుకొస్తూంటే ఆండాళమ్మగారు గబగబా వెళ్ళి కుంపటి దగ్గర పడింది. పద్మ వంకాయలు తరుగుతూ కూర్చుంది. గదిలో ఒంటరిగా తిరుగుతూంటే సారధి కేమీ తోసుపోలేదు.

"పద్మా! ఓసారిలా వస్తావూ?" అని పిలిచాడు.

"వంకాయలు తరుగుతున్నాను ఎందుకూ?" అంది పద్మ లోపలినుంచే.

"నా పెన్ను కనిపించటం లేదు."

"బావుంది. నేనేం చేసేదీ?"

"పోనీ జీడిపప్పు డబ్బాలో వుందేమో వెతుక్కోనా?"

పద్మ అత్తగారికి ఫిర్యాదు చేసింది. "చూశారా అత్తయ్యా! ఎక్కడైనా పెన్నువెళ్ళి జీడిపప్పు డబ్బాలో వుంటుందా? ఉప్మాకని జీడిపప్పు తేవటమే గానీ అది పట్టుమని పది రోజులు వుంచరు. ఒట్టి తిండి రంధి! ఏమీ లేనప్పుడు ఓ గ్లాసెడు మంచినీళ్ళు ముంచి యిచ్చినా గడగడా తాగేసి వూరుకుంటారు. ఉండండి వస్తాను" అంటూ కాసిన్ని వంకాయలు అపుజేసి లేచి వెళ్ళింది. పద్మ వెళ్ళేసరికి పెన్ను పాంటు జేబులో పెట్టేసుకుంటున్నాడు సారథి. పద్మ వెనకే వెళ్ళి జేబులోంచి పెన్ను బయటికి తీసి చూపించింది. "ఇదేమిటి?"

"అరె! ఇక్కడే వుందే! నేను చూసుకోనేలేదు."

"పిచ్చి పిచ్చి వేషాలు వెయ్యాక బుద్ధిగా కూర్చుని చదువుకోండి. లేకపోతే నానిగాణ్ణి ఆడించండి. వంట కాగానే వస్తాను" అంటూ వెళ్ళిపోతూన్న పద్మ చెయ్యి పట్టుకున్నాడు సారథి.

"అబ్బ! కాస్సేపు కూర్చో పద్మా! ఏమిటలా దూసుకుపోతావ్?" అన్నాడు బాధగా.

"బావుంది. కూర్చుంటే ఎలా?" అంటూనే కూర్చుంది పద్మ.

"సరదాగా ఇద్దరం కలిసి కుంపటి దగ్గర కూర్చుని కబుర్లు చెప్పుకొంటూ వంటచేసుకునేవాళ్ళం కదూ? ఏమిటీ

ఖర్మ చెప్పు. అక్కడికి రానూలేను; ఇక్కడ కూర్చోనూ లేను" అంటూ సొద వెళ్ళబోసుకున్నాడు సారథి.

"ఓయ్! పద్మావతీ! వస్తానని వెళ్ళి అక్కడే కూర్చున్నావేం? అన్నం వార్చేస్తున్నాను. రా! రా! వంకాయలు తరగాలి" అంటూ వంటింట్లోంచి పొలికేకలు పెట్టింది ఆండాళమ్మగారు.

"అదిగో, ఎలా బొబ్బలు పెడుతోందో. వెళ్తాను" అంది పద్మ లేవబోతూ.

"సరదాగా వుంటే సహించలేక అలాగే బొబ్బలెడుతుందలే. వెళ్ళకు" అంటూ ఆపుజేశాడు సారథి.

"ఆవిడకు కోపం వస్తే ఎక్కడి వక్కడే పారేసి ముసుగుతన్ని పడుకొంటుంది. అప్పుడైనా చేసుకోవాలిగా! వెళ్ళిపోతాను. రాత్రికి బోలెడు కబుర్లు చెప్తానులెండి" అంటూ నవ్వింది పద్మ.

సారథి విరక్తిగా పద్మ కొంగు వదిలేశాడు. "ఛీ! ఛీ! పాడు బ్రతుకు. నా పెళ్ళాం ఓ ఘడియకూడా నా దగ్గర కూర్చోదు. చచ్చిపోతాను."

"అవును. సిరాబుడ్డిలో పడి చచ్చిపోండి."

"ఛ! సిరా ఒంటినిండా మచ్చలు కట్టేస్తుంది. కాఫీ తెచ్చిపెట్టు. కాఫీ కప్పులో పడి చచ్చిపోతాను."

"కాఫీ అయినా డాగులు పడుతుంది. మంచినీళ్ళు తెస్తాను. సరేగాని వెర్రివేషా లెయ్యక చక్కగా పుస్తకం చదువుకొంటూ కూర్చోండి." అంటూ వంటింట్లోకొచ్చి

కత్తిపీట దగ్గర కూర్చుంది పద్మావతి. ఆండాళమ్మగారు ఉల్లి పాయల జల్లెడ ముందు పడేసుకుంది. "పెద్దదాన్ని ఏమైనా చెప్తే కోపం వస్తుంది. గానీ మగవాడితో సరిసమానంగా వీధి గుమ్మాలెక్కి కూర్చోవటం ఆడదాని లక్షణం కాదే పద్మా వతీ! అస్తమానూ అంటిపెట్టుకు కూర్చోకపోతే, పెళ్ళాలు కాకపోతారా; మొగుళ్ళు కాకపోతారా? నే నొకదాన్ని చాకిరీకి లేకపోతే..." ఆండాళమ్మగారు పురాణం తెరిచి శ్రావ్యంగా చదువుతోంటే "ఎంత అసూయ మనిషిరా బాబూ!" అనుకొని అత్తగారి వాగుడంతా కుడి చెవితో విని ఎడమ చెవితో వదిలేస్తూ కూర్చుంది పద్మావతి.

సారథికి మళ్ళా ఏమీ తోచలేదు— "పద్మా! కాసిని మంచినీళ్ళు తెస్తావూ? దాహంతో కాళ్ళు పీకుతున్నాయి" అంటూ అరచాడు.

"ఎందుకలా చెవికోసిన మేకలా అరుస్తావూ? విడ్డూరం" అంది ఆండాళమ్మగారు విసుక్కుంటూ.

పద్మ వంకాయలూ, ఉల్లిపాయలూ తరిగేసి గ్లాసుకు నీళ్ళు పట్టుకొని గదిలోకి వెళ్ళింది. మూతి బిగించుకుని నిల బడి మంచినీళ్ళు అందించింది.

"ఏం? అలా వున్నావ్?"

"ఎలా వున్నానూ? బాగానే వున్నాను."

"బాగా ఏం లేవుగాని చెబుదూ! నాదగ్గర దాపరికం దేనికి? మళ్ళా ఏమైనా అందా?"

"ఆ స్వమానూ మీ దగ్గర కొస్తున్నానని సాధిస్తోంది. మగవాళ్ళతో సరిసమానంగా వీధి గుమ్మాలెక్కి కూర్చో వడం ఆడవాళ్ళ లక్షణం కాదట."

"అవునవును. ఆడవాళ్ళ లక్షణా లేమిటో ఆవిడికి మహాబాగా తెలుసు. అందుకే భర్తగారు కాపరం వదిలి కాశీ పరుగెత్తారు."

పద్మ ఫక్కుమంది. సారధి జత కలిపాడు. నవ్వులను దూసుకొంటూ వంటింట్లోంచి సన్నటి రాగాలాపన విన వచ్చింది.

"అమ్మో! దేవుడోయ్! మాటలు పడమని వెళ్ళావా దేవుడోయ్!" పద్మావతి ఉలిక్కిపడింది. పార్థసారధి తెల్ల బోయాడు. ఇద్దరూ కలిసి వంటింట్లోకి పరుగెత్తారు.

"ఏమైందత్తయ్యా?"

"అదేం పెద్దమ్మా ఏడుస్తున్నావ్!"

ఆండాళమ్మగారు కుంపటి పక్కనే ఛర్రున చీదేసింది. "ఏముందిలే నాయనా! అందరూ అన్నమాటే నువ్వూ అన్నావు. ఆ మహారాజు కాశీకి వెళ్తానని నాకు మాత్రం చెప్పారా? చెప్తే చస్తే వెళ్ళనిచ్చేదాన్నా? ఓ రాత్రికి రాత్రి లేచి కట్టుగుడ్డలతో చక్కా పోయారు. తెల్లారి ఎని మిది గంటలకు లేస్తే ఈ పాపిష్టి వార్త చెవిని పడింది. ఇన్ని నీళ్ళయినా గొంతులో పోసుకోకుండా పన్నెండు గంటలదాకా కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచాను. ఇరుగమ్మా పొరుగమ్మా బలవంత పెడుతూంటే ఆ అపరాహ్ణంవేళ నాలుగు మెతుకులు

గతికి రాత్రిదాకా భోరుమని ఏడిచాను. నా దేవుడు తిరిగి రావాలని వెయ్యి గడపలు వున్న మాపూళ్ళో గ్రామకుంకం నోము నోచాను. ఎన్ని చేస్తే ఏం లాభం ? నా మంచి గుణం ఎవరికి తెలుసు దేవుడోయ్! నన్ను మాటలు పడమని వెళ్ళావా దేవుడోయ్...డోయ్...డోయ్...". అంటూ ఆండాళమ్మగారు యింటికప్పు ఎగరగొట్టేస్తూంటే పాపం పార్థుడు బిత్తరపోయాడు. "నిజంగా నీ మంచి గుణం తెలీక అనేశాను: వూరుకో పెద్దమ్మా! ఏమీ అనుకోకు పెద్దమ్మా! సరోజ పెళ్ళి కొచ్చినపుడు ఆ సూర్యంగాడే చెప్పాడు పెద్దమ్మా! నాకేం తెలుసూ? అంతా నమ్మేశాను. పూరుకో పెద్దమ్మా!" అంటూ పెద్దమ్మ ఎదటే చతికిలబడి బతిమాలటం ప్రారంభించాడు.

ఆండాళమ్మగారు బెక్కుతూ బెక్కుతూ ఉండిపోయింది. సారథి పిల్లిలా జారుకున్నాడు. పద్మావతి నోటికి కొంగు అడ్డు పెట్టుకొని కూర గిన్నె కుంపటి ఎక్కించింది.

ఆండాళమ్మగారు తొందరగానే తేరుకోగలిగింది. అంతా మరిచి ఎప్పటి ఉద్యోగంలో జాయినయింది.

రాత్రి సారథి భోంచేస్తూంటే పద్మ బాబును బుజాన వేసుకొని పడక గదిలో తిరగసాగింది. ఆండాళమ్మగారు సారథి దగ్గర జేరింది— "ఒరేయ్ నాయనా! నీకు కోపం రాకపోతే పెద్దముండను ఒకమాట చెప్పనా ?"

"ఏమిటి పెద్దమ్మా అది ?"

"బా త్తిగా అర్థణాకూ అణాకూ దాని ముందు చెయ్యి జాపటానికి నీకు అభిమానం కాదు(టా? పోనీ అడగ్గానే గౌరవంగా ఇస్తుందా? లక్షు ప్రశ్నలు వేస్తుంది."

"అసంతా సరదాకు అంటుంది పెద్దమ్మా! అంతే గానీ..."

"ఆ ఎన్ని చెప్పు. మొగబిడ్డవు. లక్షణంగా సంపాదించుకుంటున్నానయ్యే! ఆడదానిముందు చెయ్యి జాపటం బాగులేదు సుమీ!"

సారథికి చిరాకు వేసింది. "సరేగాని పులుసు వెయ్యి."

పులుసుతో బాటు మరికొంచెం నెయ్యి కూడా ప్రేమగా వడ్డించింది ఆండాళమ్మగారు. "నాకు తెలీ కడుగుతానూ, జీతం అదీ దానిచేతికే యిచ్చేస్తావేమి(టా?"

"ఎవరికిచ్చేది మాత్రం ఏముందిలే. ఇద్దరం వాడుతూనే వుంటాం."

"ఆ, మగాడి చేతి బిడ్డా, ఆడదాని చేతి అర్థమూ దక్క వంటారు. లక్షణంగా సంపాదించుకొంటున్న నాడిపీ నీ దగ్గరే అట్టేపెట్టుకోకా ... ఆ, వూరికేనే అన్నాననుకో, ఎవరి దగ్గర వుంటే ఏముందిలే."

"అవును. ఎవరి దగ్గరుంటే ఏముంది పెద్దమ్మా! నీదగ్గరున్నా లక్షణంగా వుంటుంది."

"అయ్యో! దానికేం భాగ్యం? అలాగే యివ్వరా! నిక్షేపంలా వుంచుతానూ."

సారధి నవ్వుకొంటూ చేయికడుక్కొని లేచిపోయాడు. పద్మ భోజనానికి వెళ్ళింది. ఎప్పుడొస్తుందా? ఆండాళమ్మగారి అమోఘమైన సలహాలు ఎప్పుడు చెబుదామా? అని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. పద్మ వచ్చింది. ముభావంగా పక్క సర్దుకొని పడుకొంది. సారధి పద్మచెయ్యి చేతిలోకి తీసుకోబోతే విసిరికొట్టింది. తెల్లబోయిన సారధి—"ఇదేమిటి అలక? రాత్రికి ఎన్నో కబుర్లు చెప్తానన్నావ్?" అన్నాడు. పద్మ మాట్లాడలేదు.

"పద్మా! ఏమిటిది?" అన్నాడు. మళ్ళా పద్మ అటు తిరిగిపోయింది. సారధికి కోపం వచ్చింది.

"నేనేం చేశానో చెప్పి సాధించరాదూ?" అన్నాడు.

"మీరు ఏమీ చెయ్యలేదు. సాధించటానికి నేనెవ త్తెనూ? నిద్ర వస్తూందని పడుకున్నాను. అదీ తప్పే?" అంది వ్యంగ్యంగా.

"తప్పుకాదు. నువ్వు ఏంచేసినా తప్పుకాదు. నీకు సమంజసం అనిపించినట్టే చెయ్యి. కాని పద్మా! నువ్వు ఇంత మూర్ఖంగా ప్రవర్తించినట్టు నా కెప్పుడూ గుర్తు లేదు" అంటూ సారధిలేచి మడత మంచం వాల్చుకుంటూంటే పద్మ వారించలేదు. కనీసం చూడనైనా చూడలేదు. మాట్లాడకుండా నిద్రపోయింది.

♦ ♦ ♦

మర్నాడు పగలుకూడ పద్మ అలానే ముభావంగా ఉండిపోయింది. సారధి పలకరించటానికి కూడా ప్రయత్నించ

లేదు. దంపతులిద్దరూ అంటీ అంటనట్టుగా తిరగటం మొదట ఆండాళమ్మగారికి తగని ఆశ్చర్యం కలిగించినా ఏమిటో అర్థమైనట్టు ముసి ముసిగా లోలోపల నవ్వుకొంది.

ఆ సాయంత్రం జీతం అందుకుని సారథి ఇంటికొచ్చాడు. తనంత తనే పద్మను పలకరించాడు. "పద్మా! పర్సతీసి దాచు" అన్నాడు.

పద్మ కోపం అంతా వెళ్ళగక్కుతూ విసురుగా అంది—"నాకేం అవసరం లేదు. మీరే దాచుకోండి. లేకపోతే మీ పెద్దమ్మగారికి ఇవ్వండి"

"పద్మా!"

"ఏం? మీ గుసగుసలు నేను వినలేదనుకున్నారా?" సారథి విస్తుబోయాడు. "గుసగుసలా? ఆవిడేదో వాగింది. అది నీకు లెక్కా?"

"కాదు. మీ ప్రవర్తనే నాకు లెక్క! ఎంత లాలూచీ లేకపోతే నన్నుగురించి మీదగ్గర చెప్పటానికి ఆవిడ ధైర్యం చేస్తుంది? పూలు తేకండి; డబ్బు నాచేతి కివ్వకండి. ఆవిడ మీకు ఎకరాలు రాస్తుంది కదూ?"

"నోర్ముయ్! ఛీ! ఇంత పశువులా ప్రవర్తిస్తావని ఎన్నడూ అనుకోలేదు. నన్ను అన్నివిధాలా తెలిసికూడా..." సారథి అరచేతిలో నుదురు ఆన్చి బాధగా కూర్చుండి పోయాడు. పద్మ క్షణం మౌనం వహించింది. "నూరురాళ్ళు విసిరితే ఒక్కరాయైనా తగలకపోదు. ఇటువంటి పెద్దమనుష్యు

లున్న సంసారాలు బాగుపడ్డట్టే. మీకు మొహమాటం లేకు కాబోలు ఆవిణ్ణి పొమ్మని చెప్పండి. వెధవ తద్దినం.”

సారథి కస్సుమన్నాడు. “చెప్పాలంటే క్షణం పట్టదు. కాని చస్తే చెప్పను. గుణవంతురాలివే! సహనవంతురాలివే! బాధపడిపోతావేం? ఓర్పు నీసొత్తు కదూ! ఏమైపోయింది?”

పద్మ కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. దిండులో మొహం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడవసాగింది. పద్మ కళ్ళ నీళ్ళు పెట్టుకోవటం సారథి ఎన్నడూ ఎరగడు. ప్రియమైన పద్మ. ప్రాణంవంటి పద్మ ఏడుస్తోంటే ఎంతో బాధకలిగింది సారథికి. అయినా నిర్లక్ష్యంగా సిగరెట్టుమీద సిగరెట్టు నుసి చేస్తూ కూర్చున్నాడు. కొంతసేపటికి మరి ఉండబట్టలేక లేచివచ్చి పద్మ పక్కలో కూర్చుని తలనిమురుతూ బుజ్జగించాడు. “పద్మా! ఛ ఏమిటిది? మరీ పిచ్చిదానివై పోతున్నావ్!”

“అవును. పిచ్చిదాన్ని కాబట్టే మీరిద్దరూ మంతనాలు చెయ్యకలుగుతున్నారు.”

“పద్మా! నీధోరణి నీదేనా? నన్ను నమ్ము పద్మా! నీకన్నా ఆండాళమ్మ ఎక్కువా నాకు? నామీద ఇంత నిందవెయ్యటానికి నీ మనస్సు ఎలా అంగీకరించింది. పద్మా! నామాటవిను. కొన్నాళ్ళు అనుభవించాలి. సమయం రాక పోదు. నేనుమాత్రం పొమ్మని ఎలాచెప్పేది?”

సారథిఎంత సముదాయించినా పద్మను పూరాట కలగ లేదు. కన్నీళ్ళతోనే వేళగాని వేళ నిద్రపోయింది.

♦ ♦ ♦

పద్మ తెల్లారి లేచిందిమొదలు అత్తగార్ని పలకరించ లేదు. వంటపని తానే చూసుకోటం ప్రారంభించింది. వంట పూర్తయ్యాక చీర ఉతికి ఆరవేసుకుంటూంటే "అమ్మాయ్! నా మడిబట్ట కూడా కాస్త నీళ్ళముంచిపెట్టు" అంది ఆండాళమ్మగారు.

"నేను ఉతకలేను" అంది పద్మ ఖచ్చితంగా. ఆండాళమ్మగారు కొరకొరా చూసింది. వీలైతే కోడలి పిల్లను కరకరా నమిలి హారెయ్యాలని పళ్ళు పటపట లాడించింది. పద్మావతి ఏమీ లెక్కపెట్టకుండా తనపని తాను చూసుకుని గదిలోకెళ్ళి కూర్చుంది.

ండాళమ్మగారి హృదయం అవమానంతో మండిపోయి ఏదైనా ప్రతీకారం చెయ్యమని ప్రేరేపిస్తోంది. పరిపరివిధాల ఆలోచించింది. ఏమీ తోచలేదు. ఉపాయం దొరకకుండానే సాయంత్రమైపోయింది. పద్మ బాబిగాణ్ణి పెరట్లో జామచెట్టు క్రింద కూర్చోబెట్టి వాడిముందు నాలుగు బొమ్మలు పడేసి వంటింట్లోకెళ్ళి కుంపటి అంటించడానికి కూర్చుంది. బాబిగాడు బొమ్మలతో కేరింతాలు కొడుతూ ఆడుకోటం ఆండాళమ్మగారికి ఏమీ నచ్చలేదు. గబా గబా వెళ్ళి "మన్ను తింటావేంరా వెధవా! తెగుళ్ళునస్తే ఎవరు పోసుతా రనుకున్నావ్!" అంటూ వాణ్ణి నాలుగు బాదింది పసివాడు హడలిపోయి కెవ్వుమని గుక్కపట్టాడు. కుంపటి అంటి[illegible] పద్మ పరుగెత్తుకొచ్చింది. కొడుకు వీపురాస్తూ గుండెల కదుముకొంది. బాబు గుక్కపట్టి ఏడుస్తూంటే పద్మ కళ్ళవెంట నీళ్ళు తిరిగాయి.

"నామీద కోపం పసివాడిమీద చూపిస్తారా? చిన్నవెధవను చావబాదటానికి మీ చేతులెలా వచ్చాయి?" అంది గట్టిగా కోపంతో మండిపడుతూ.

"చూసే మాట్లాడుతున్నావటే! వాడు గుప్పిళ్ళకొద్ది మట్టి బొక్కుతున్నాడని ఒకటి వేశాను."

"ఛీ! పెద్దవాళ్ళయికూడా నోరులేని వెధవమీద నేరాలు మోపుతారు. వాడు మన్ను తిన్నదీ నిజమే; మీరు చూసిందీ నిజమే. పుట్టిన తర్వాత ఇంతవరకూ దెబ్బపడి ఎరగడు. వాడి భారమేమీ మీరు మొయ్యటంలేదు. వాణ్ణి మీరు ఎత్తుకోనూ వద్దు; ఆడించనూవద్దు. వాడి ఒంటిమీద చెయ్యివేస్తే ఊరుకోను." మహాకాళిలా శాసించింది పద్మావతి.

"అయ్యో! అయ్యో! ఎందుకే అన్నిమాటలంటావు? వాణ్ణి మందలించడానికి నేను తగనుటే?"

పద్మ బాబును భుజాన వేసుకొని గదిలోకెళ్ళిపోయింది. సారథి వచ్చేవరకూ బాబు ఏడుస్తూనే వున్నాడు.

"ఏం? బాబు ఏడుస్తున్నాడు?" అన్నాడు సారథివస్తూనే. పద్మ మాట్లాడలేదు.

"నిన్నే అడిగేది. ఏమిటా నిర్లక్ష్యం?"

"ఏం చెప్పమంటారూ? మడిపంచె ఉతకనన్నానని కోపం తెచ్చుకొని వాణ్ణి చావబాదింది."

"ఏంటీ? పెద్దమ్మా! బాబును కొట్టిందా? నువ్వేం చేస్తున్నావ్!" మండిపడ్డాడు సారథి.

ఆండాళమ్మగారు తలుపులు గెంటుకు వచ్చేసింది. "ఉన్నమాట నీకు చెప్తాను నాయనా! చిన్నవెధవ మట్టి ముద్దలు మింగుతూంటేనూ భయానికి ఒకటి వేశానే అనుకో— ఆ మాత్రానికి నీ పెళ్ళాం నానామాటలూ అనాలా?"

"వాణ్ణి నేముకూడా ఎన్నడూ కొట్టలేదు పెద్దమ్మా! వాళ్ళమ్మకు కష్టంతోచి అంటే అంటుంది."

ఆండాళమ్మగారు టక్కున నోరు మూసేసింది. ఎడమొహం పెడమొహంగా తిరుగుతూన్న మొగుడూ పెళ్ళా లిద్దరూ ఒక్కటయ్యారు. తనే వేరు అయింది. నెమ్మదిగా వాళ్ళను మంచిచేసుకోకపోతే వ్యవహారం బెడిసి కొట్టేలావుంది.

సారథి బాబును అందుకొని భుజంమీద వేసుకొని తిప్పుతూ—"మట్టి తిన్నావా బాబూ?" అన్నాడు.

"అవునులే! నీ బిస్కట్లన్నీ అమ్మ తినేస్తూంటే నువ్వు మట్టికాక మరేం తింటావు?" అంటూ వీపు నిమురుతూ బుజ్జగించాడు.

"అయ్యో! నీ సరసం బంగారంగానూ! చిన్నపిలాడి బిస్కట్లు అదెందుకు తింటుందిరా?" అంటూ పద్మ వతిసి వెనుక వేసుకొని వచ్చి పకపకా నవ్వేసింది. ఆండాళమ్మగారు.

"నీ సిగ్గు చితికినట్టే ఉందిలే" అనుకొని పద్మ కుంపటి అంటించి గబగబా కాఫీచేసి తెచ్చి యిచ్చింది సారథికి. బాబు వడ్చివడ్చి నిద్రపోయాడు. బాబును పడుకోబెట్టి కాఫీగ్లాసు అందుకొంటూ—"మీ నాన్నగారు ఉత్తరం రాశారు పద్మా!

మా అక్కయ్య వచ్చిందట. నిన్నూ బాబునూ టోందట. ఓ పదిరోజులు పంపమని రాశారు.. నా అభ్య ఏమీలేదు. వెళ్ళిరా! బావుంటుంది" అన్నాడు.

పద్మ మాట్లాడకుండా వూరుకుంది. "ఎప్పుడు బయల్దేరి వెళ్ళేదీ మీ నాన్నగారికి ఉత్తరం రాయి. స్టేషన్ కొస్తారు" అన్నాడు.

"ఈ పరిస్థితుల్లోనా? చస్తేవెళ్ళను" అంది పద్మ.

సారధి అర్థంచేసుకున్నట్టు వూరుకున్నాడు.

"అయ్యో! అదేమే పద్మావతి? తోడబుట్టింది నిన్ను చూడాలని ఉందని రాస్తే లక్షణంగా పుట్టింటి కెళ్ళిరాక! వాడి తిండీ తిప్పలూ చూడడానికి నేనున్నాను కాదుటే! బావుండదు. వెళ్ళిరామ్మా! నీ ఇంటి కేంపర్వాలేదు" అంటూ కోడలికి అభయం ఇచ్చింది ఆండాళమ్మగారు.

"పద్మా! నాకేం పర్వాలేదు. నీకు వెళ్ళాలని ఉంటే వెళ్ళు" అన్నాడు సారధి గుంభనంగా ఈ అండాళమ్మ పప్పులు నాదగ్గర వుడకవులే అన్నట్టు.

"నేను లేకపోతే మీకు కుదరదు. నాకు తెలుసును గాని వేధించకండి" అంది పద్మ విసుగ్గా.

ఎంచక్కా పద్మావతి వెళ్ళిపోతే ఓ పదిరోజులపాటు ఇల్లంతా ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలిపారేద్దామనుకున్న ఆండాళమ్మగారికి సరదాపోయి కసి పుట్టింది. "ఇదేం చోద్యమే తల్లీ! నువ్వు లేకపోతే వాడికి క్షణం జరగనట్టే చెప్తున్నావ్. మొగవాడిక మడి కడతావా ఏమిటే!" అంది చేతులు

పద్మావతికి కోపంవచ్చింది, చిరాకు వేసింది. ఇక
ళమ్మ విషయంలో ఉపేక్ష చెయ్యకూడ దనిపించింది.
మ దాంపత్యంలో కలతలు రేపటానికి ఆవిడ చేస్తున్న
ప్రయత్నాలన్నీ వ్యర్థం సుమా! అని ఆవిడకు బోధపడేలా
చెప్పాలనిపించింది. అందుకే గర్వంగా అంది—

"నా మొగుడికి మడే కడతానో, దడే కడతానో.
మా దాంపత్యం మీ రనుకున్నంత తేలికైంది మాత్రం
కాదు. మాయిద్దరికీ ఒకటే బ్రతుకు — ఒకటే చావు" అని.

తమ దాంపత్యాన్ని గురించి పద్మ అంత బలీయమైన
అభిప్రాయం కలిగి ఉన్నందుకు పార్థసారథి సంతోషంతో
మూగవాడయ్యాడు. కాని ఆండాళమ్మగారుమాత్రం ఫకా
ళించి నవ్వింది పోయేకాలం వచ్చిన దానిమల్లే. "నాదగ్గర
చెప్తావులే నీసంసారం గొప్పలూ! బ్రతికున్నంతకాలం అంతా
మోజుగానే వుంటారు. కన్నుమూస్తే అంతాసరి. నీఅత్తగారు
చస్తే నీ మామ మడికట్టుకున్నాడా? ఏడాది తిరక్కుండా
మరోదాన్ని తెచ్చుకున్నాడు. అలాగే నువ్వూ"

"పెద్దమ్మా!" పిచ్చిగా అరిచాడు పార్థసారథి.

ఆండాళ్ళమ్మ కంపించిపోయింది. పద్మ ప్రతిమలా
నిలబడిపోయింది.

"మాట వరసకు......ఏదో......పెద్దముండను."

"ఛీ! నోర్ముయ్! బుద్ధిలేనిదానా! ఇంకా వాగుతు
న్నావ్. నీ పెద్దరికం అనుభవించి సుఖపడ్డాం. ఇక చాలు.

తక్షణం బయటికి నడు. ఒక్క క్షణంకూడా నా యింట్లో వుండటానికి వీల్లేదు.” సారథి హద్దులు మీరిన కోపంలో దాదాపు ఒళ్ళు మర్చిపోయాడు. ఆండాళమ్మగారు గజగజా వణుకుతూ చతికిలపడిపోయింది. లేని ధైర్యం పుంజుకుని— “ఎందుకురా అలా కేకలేస్తావ్రా? నే నేం కానిమాట లన్నానని?” అంది నెమ్మదిగా.

“నువ్వేన్ని మొత్తుకున్నా వినను. ఇకచాలు. నీకూ మాకూ సరిపడదు. మూటా ముల్లే సర్దుకుని వెళ్ళిపో. నువ్వు మా ఇంట్లో వుండటానికి వీల్లేదు.”

ఆండాళమ్మగారికి పౌరుషం వచ్చింది. లేచి నిలబడింది.

“ఏమిట్రా? ఛోఛో అంటావ్ కుక్కను తరిమినట్టు. నన్నేం పూరికే ఉంచుకున్నావా? బోలెడు రూపాయిలు వచ్చే కాయితాలు నీచేతుల్లో పెట్టాను. రెండెకరాలు నీకే రాస్తానన్నాను. నీ కొడుక్కు గొలుసు ఇచ్చాను. అన్నీ ...”

“తల్లీ! నీ డబ్బుకూ, నీ ఎకరాలకూ, నీ గొలుసుకూ, నీకూ తలొక పదివేల నమస్కారాలు. మమ్మల్ని వదిలిపెట్టు. నీ పాపిష్టి సొమ్ము చిల్లిగవ్వనాకొద్దు. నీ సరుకులన్నీ తీసుకుని బయల్దేరు—పద్మా! డ్రాయరు సొరుగులో ఆ కాయితాలు ఉన్నాయి. చూశావా! ఆ గొలుసుకూడా తెచ్చిపడేయ్. తొందరగా రా! లేకపోతే మనమీద ప్రచారం చేస్తుంది.”

పద్మ ప్రతిమరూపం విడిచి తొందర తొందరగా డ్రాయరులో కాయితాలూ, నిద్రపోతున్న బాబిగాడి మెడలో గొలుసూ, చిలక్కొయ్యకు వేలాడుతూన్న సల్లసంచి, అల మార్లో దాచివుంచిన తెల్లప్పంచీ, కూరగాయలు వేసివున్న మేదర బుట్టా, వంటింటి అలమరలోంచి మరచెంబూ తలగ డగా వుపయోగించుకునే గుడ్డల మూట, ఆండాళమ్మ గారి వస్తువులు సర్వం ఆవిడ చుట్టూ పోగేసింది.

"మొన్న నేను కొన్న కంచుచెంబు దాచుకుందా మనుకున్నావుటే? అదీ ఇలా పారెయ్." ఆండాళమ్మగారు గర్జించింది. పద్మ తన మతిమరుపుకు తిట్టుకొని గబగబా అలమారులో కొత్తచెంబుకూడా తీసుకెళ్ళి దగ్గరపెట్టింది. 'నీ సరుకులన్నీ వున్నాయి. ఇక బయల్దేరు' అన్నాడు సారథి. ఆండాళమ్మగారు బిక్క మొహం వేసుకొంది. "చీకట్లి పడిపో తోంది ఇప్పుడెక్కడికి వెళ్ళమంటావురా పార్థుడూ?" అంది కళ్ళు ఒత్తుకొంటూ.

"నిన్ను ఎవరూ భరించలేను. ఆ సూర్యం దగ్గరికే వెళ్ళు" అన్నాడు సారథి.

ఆండాళమ్మగారు కస్సుమంది. "ఆ వెధవ దగ్గరికి వెళ్ళటానికి నాకేం ఖర్మ? నువ్వూ వాడే బయల్దేరారు బుద్ధి మంతులు—నా ఇష్టం వచ్చినచోటికి పోతాను, నా ఆస్తంతా నా ఇష్టం వచ్చినవాడికి ధారపోస్తాను."

"అవునవును. సూర్యం కూతురుకు గొలుసు చేయిం చినట్టూ, సరోజకు రెండెకరాలూ చదివించినట్టూ—సరే! నీ

ఇష్టం వచ్చినచోటికే వెళ్ళు. కాని వెళ్ళిపోయేముందు నాలుగు ముక్కలు చెప్తాను. కాస్త శ్రద్ధగా విని మరీ వెళ్ళు.

"నీకు వయసు పెరుగుతోంది. కానీ గుణం తరుగుతోంది. అన్ని విధాలా లక్షణమైన స్త్రీ కాపురం నువ్వు నిలుపుకోలేక సర్వనాశనం చేసుకున్నావు. అలాగే, అందరి కాపురాలు నాశనం చెయ్యాలని కంకణం కట్టుకున్నావు. నిన్ను పువ్వుల్లో పెట్టి చూచేవాళ్ళున్నా అందరితోనూ అల్లరి పడుతూ బంధుజనోద్ధరణకని బయల్దేరావు. ఏ సంసారం పచ్చగా వున్నా, ఏ భార్యా భర్తలు సుఖంగావున్నా నీ కళ్ళు ఓర్చలేవు. ఏదోవిధంగా వాళ్ళను విడదియ్యటానికీ ఆ సంసారంలో దోసెడు నీళ్ళు పొయ్యటానికీ తాపత్రయపడతావు.

"నీ గురించి నాకు ముందే అంతా తెలుసు. నువ్వు వస్తానని వుత్తరం రాస్తే నాకు సుతరామూ ఇష్టంలేదు. కాని పద్మ నీ పెద్దరికంలో సుఖపడాలని ఉబలాట పడింది. దాని కోరిక కాదనలేక సరే అన్నాను. నిన్ను రమ్మని జవాబు రాయలేదు; గివాబూ రాయలేదు. అయినా నువ్వు వచ్చింది మొదలూ నిన్ను గౌరవించి ఆదరించటానికే ప్రయత్నించాం. నువ్వు సజావుగా వుంటే కన్నతల్లిలా కాపాడుకునేవాడిని— అటువంటి విషయాలు నీకు అర్థమే కావు. నీవల్ల సుఖపడింది లేదు సరిగదా మా ప్రాణాల కొకా పెనుభూతంలా తయారయ్యావు. నీ గురించే మా ఇద్దరిలో ఎన్నడూ ఎరుగని మనస్పర్థలుకూడా పుట్టుకొచ్చాయి. భగవంతుడి దయవల్ల చేతులు కాలకముందే కళ్ళు తెరవగలిగాను. నువ్వు మాయింటినుంచీ

వెళ్ళిపోతే చాలు — ఒక్కమాట పెద్దమ్మా! నువ్వంటే నాకు ఎప్పుడూ సద్భావంలేదు. కాస్త కూస్త ఉన్నా అది ఈ క్షణంతో సరి. అందుకే ఇంత నిర్మొహమాటంగా ఇన్ని మాటలు అనగలుగుతున్నాను. ఇక వెళ్తావా?"

"అయ్యో! అయ్యో! ఎంతలేసి మాట లన్నావురా! ఎంత లేసి మాటలన్నావురా! ఈ జన్మలో మరిచిపోతానట్రా?"

"మర్చిపోకు...మర్చిపోతే మళ్ళా వస్తావు పెద్దమ్మా!"

"నిన్నుచూసి నవ్వాలో ఏడవాలో అర్థంగాని మనిషివి. ఎందుకిలా పదిమందిలోనూ అల్లరిపడతావు చెప్పు! నీతోటి ఆడవాళ్ళంతా ఎంత లక్షణంగా బ్రతుకుతున్నారో నీకు తెలీదా? నువ్వు ఎక్కడో ఒకచోట స్థిరంగా సుఖంగా ఎందుకుండ లేవు? అర్థంలేని నీ అధికారాలు ఎవరు సహిస్తారు? నీ ఆస్తిపాస్తులు ఎరపెట్టి మనుషుల్ని కొనాలని చూస్తావే, అంత పనికిమాలిన వాళ్ళెవరుంటారు? మనిషి జన్మ ఎత్తావు. అందులోనూ ఎన్నో కష్టసుఖాలు, మంచి చెడ్డలు భరించాల్సిన ఆడపుట్టుక పుట్టావు. ఏ విషయంలోనైనా స్త్రీననిపించుకోగలిగావా? పదిమందికీ చెరుపైతే నీ జన్మకు సార్థక్యం ఏమిటి? ఇకనుంచైనా కాస్త జ్ఞానం తెచ్చుకుని..."

"ఒరేయ్! నీ నీతులు నాకక్కర్లేదు. నీ పెళ్ళానికి చెప్పుకో. నే నెలాగూ చెడ్డముండనే. నా యిష్టం వచ్చినట్టు వుంటాను" అంటూ పౌరుష పడింది ఆండాళ్ళమ్మగారు.

రెండు నిమిషాల్లో సామానంతా సర్ది కట్టుకొంది. ఎందుకో కళ్ళు చెమర్చుతోంటే కొంగుతో తుడుచుకొంది.

సంచులూ మూటలూ చెంబులూ అన్నీ తగిలించుకుని నాలు గడుగులు వేసింది.

ఆవిడ స్థితి చూస్తోంటే పద్మకు జాలివేసింది "పోనీ ఈ ఒక్క రాత్రికి వుండనివ్వండి. రేపు ఉదయమే వెళ్ళిపో తుంది" అంది నెమ్మదిగా సారథితో.

వీల్లేదని తల అడ్డంగా ఆడించాడు సారథి.

ఆండాళమ్మగారు వెక్కుతూ వెక్కుతూ మెట్లు దిగి రోడ్డు మీది కెళ్ళింది. సారథీ, పద్మా వీధిగుమ్మంలో చూస్తూ నిలబడ్డారు. చూస్తూవుండగానే ఆండాళమ్మగారు కనుచూపు మేర దాటిపోయింది.

పద్మ కళ్ళనుంచి నీళ్ళు జారిపడ్డాయి. "ఈ గొడవంతా నేనే తెచ్చిపెట్టుకున్నాను" అంది పద్మ చెంపలు తుడుచు కొంటూ. సారథికూడా బాధగా నిట్టూర్చాడు. "ఆవిడ ఎంత చెడ్డదైనా ఏమిటో మనకు దూరమౌతూంటే బాధగా వుంది. ఇది ఏనాటికైనా జరిగితీరాలి పద్మా! ఆవిడను భరించాల్సింది మనం కాదు.

"అయితే ఆండాళమ్మ వెళ్ళిపోయిం దన్నమాట. నా కింకా నమ్మకం కలగటం లేదేం ఖర్మ? ఈనాటినుంచీ మన ఇంటిలో సుఖశాంతులూ మనకు సర్వస్వతంత్రాలూ వుంటాయన్నమాట. అంతేనా?" అన్నాడు సారథి కాస్త హుషారు చేస్తూ.

పద్మ ముభావంగా నవ్వింది.

"ఛ! నువ్వు ఇంకా బాధపడతా వెందుకూ! ఆవిడ కేం పర్వాలేదు. ఎక్కడికి వెళ్ళాలనుకుంటే అక్కడికి లక్షణంగా జేరుతుంది. ఈ తిరుగుళ్ళన్నీ అలవాటే. అన్నట్టు ఆవిడ నీకు ఆ రిక్షా పావలా ఇచ్చిందీ?"

"పోదురూ?" అంటూ నవ్వేసింది పద్మ.

"అబ్బ! నాలుగు పూటలనుంచీ నవ్వేకరువు జేశావ్" అంటూ పద్మను దగ్గరికి తీసుకున్నాడు సారథి.

"నేను మావూరు వెళ్తాను. మా అక్కను చూడాలని వుంది."

"ఓ నీ యిష్టం. కాని మీ అక్కధ్యాసలోపడి నన్ను మర్చిపోకుండా పది రోజుల్లో వచ్చేస్తే—"

"మీరు ఎంత మంచివారండీ" అంది పద్మ హాస్యంగా.

"అవునట. అంతా నన్ను అలానే అంటారు."

"ఒక్క ఆండాళమ్మ తప్ప..." నవ్వింది పద్మ.

"ఆండాళమ్మ మనకు విడిచిపోయిందేమిటో తెలుసా! మహా చెడ్డపేరూ—ఏభై రూపాయిల అప్పూ వేంకటేశ్వరుడి మొక్కూ..."

—: సమాప్తమ్ :—

శ్రీమతి ముప్పాళ రంగనాయకమ్మగారే

వివాహాత్పూర్వం దద్దనాల రంగనాయకమ్మగారని.

పాఠకులు గ్రహించ ప్రార్థన.




క్రృష్ణమోహన్ ఇంటికి వుత్తరం వ్రాశాడు.

ప్రియమైన అమ్మకు...

హృదయపూర్వకంగా నమస్కరించి నీ కృష్ణ రాసేది : నేను క్షేమంగా వున్నాను. నువ్వూ, తులసీ, మన వాళ్ళంతా క్షేమమని తలుస్తాను. ఈ పరీక్షలు బాగానే వ్రాశాను. శెలవులిచ్చారు. అదివారం సాయంత్రం ఇంటి కొస్తాను. నాతోపాటు ఇందిరకూడా వస్తున్నది. ఇందిర గురించి చాలసార్లు మీతో చెప్తూవుంటాను, తెలుసుగా? ఇందిరకు పల్లెటూళ్లు చూడాలని ఎన్నాళ్ళనుంచో కోరిక. వాళ్ళ బంధువులంతా పట్నవాసమే. ఒకళ్ళో, ఆరో వున్నా వాళ్ళదగ్గర కెళ్లటానికి యిష్టంలేదట. రెండేళ్ళనుంచి తెలిసిన వాణ్ణి గాబట్టి నాతో పంపటానికి వాళ్ల పెద్దవాళ్లకేం అభ్యం తరం వుండదు. నేనంటే, ఇందిర నాన్నకీ, అమ్మకీ అభిమా నం, నమ్మకం. వాళ్లమ్మగారే స్వయంగా అడిగారు– "మా ఇందిరను జాగ్రత్తగా తీసికెళ్తావా?" అని. "జాగ్రత్తేమిటో నాకు తెలీదండీ, మీ అమ్మాయి నా వెనకే నడిచివస్తే జాగ్రత్తగానే తీసుకెళ్తాను" అన్నాను. ఎంత బస్తీపిల్లయినా కాలేజీలో చదువుతున్నా ఇందిరకు తగని సిగ్గు. కొత్తవాళ్లతో మాట్లాడ్డానికే బిడియపడే ఇందిర నాతో మనవూరు వస్తా

నంటే నాకే ఆశ్చర్యం వేసింది. మన తులసి నయం. ఝుమా యించి మాట్లాడేస్తుంది ఎవరితోనైనా—మొత్తానికి ఇందిర నాతో వస్తున్నది. ఆ వున్న నాలుగు రోజులూ బ్రస్తీపద్ధతులకి తగ్గట్టు బాగానే ఫలహారాలవీ రెండుపూటలా చెయ్యాలి. మైదా పంచదార లాంటివేమైనా కావాలిస్తే శెట్టిదగ్గర తెప్పించు. నేను వచ్చేటప్పుడు బిస్కట్లూ, జీడి పప్పులూ, రవ్వా అవీ తీసుకొస్తాను.

తర్వాత సంగతేమిటంటే మేడమీద గదీ, వసారా శుభ్రం చేయించు. కింద ఏర్పాటుచేస్తే క్రిందే వుంటుందనుకో. ఎలాగూ మనకి తాతలు సర్దాకికట్టి పడేసిన భవనం వుందిగా! పైకైతే గాలికూడా బాగా వస్తుంది దక్షిణంవైపు. ఇందిరవున్న నాలుగురోజులూ తులసికూడా జతగా మేడ మీదే వుంటుంది. మరిచాను, స్నానాలదొడ్డి ఎలా వుంది? ఎప్పుడుచూచినా దడులూడిపోయి శిథిలావస్థలోనే వుంటుంది. కంది కంపా, తాటాకు పెట్టి అప్పన్నతో దొడ్డి కట్టించు. మనలా బస్తీవాళ్లు మరుగులేకుండా స్నానం చెయ్యరు. ఈ విషయంమాత్రం మర్చిపోవద్దు—ఇంకో విషయం: ఆదివారం సాయంత్రం కోచీకి స్టేషన్‌కి బండి పంపు. బండికి గూడు కూడా వుండాలి సుమా? పొద్దుపోతుంది. పొలాలవీ చూసు కుంటూ రావటానికి గూడు లేకపోతేనే బావుంటుందనుకో, కానీ, ఏమో ఈ కాలం నమ్మటానికి వీల్లేదు. నాలుగు చినుకులు పడ్డా నానా గొడవౌతుంది. గూడుచాప అల్లించాలని అనుకోవటమేగానీ ఎప్పుడూ శ్రద్ధ చెయ్యలేదు.

ఈసారి తప్పకుండా అల్లించాలి. వీలైతే మేదరి వీరయ్యని పిలిపించి చెప్పు. పోనీ నేవచ్చి చెప్తాలే.

ఇందిర వచ్చేసంగతి ఇప్పుడప్పుడే అందరితోటీ చెప్పి రావద్దని చెప్పు తులసి తల్లికి. కిందటిసారి యిచ్చిన పుస్తకాలేమైనా వుంచిందా? వాళ్ళకీ వీళ్ళకీ బొమ్మలు చూసుకోటాని కిచ్చేసిందా? మొన్న పంపిన పుస్తకాలు అందాయా? అప్పుడప్పుడూ వుత్తరాలు రాస్తూండమని కార్డులిచ్చి వచ్చాను. వాటి నేగంగలో పడేసిందా! ఒక్కటికూడా రాసింది గాదేం! ఈసారి మంచిమంచి పుస్తకాలు తెస్తున్నానని చెప్పు. ఊరికే యిళ్ళట్టుకు తిరక్క పంపిన పుస్తకాలు చదువుకోమను. ఇందిరని చూసైనా కొంత కుదురు నేర్చుకుంటుందేమోలే.

అన్నట్టు మరి ఇందిర వెళ్ళిపోయేటప్పుడు ఒక చీరైనా పెట్టకపోతే బావుంటుందా? అప్పటికప్పుడు మనవూళ్ళో చీర లెక్కడ దొరుకుతాయి! అందుకే ఇక్కణ్ణుంచే ఓ చీరా జాకెట్టుగుడ్డా తేవా లనుకుంటున్నాను. డబ్బు మిగిల్తే తులసికి కూడా తెస్తాను— ఇంక విశేషాలేం లేవు. స్టేషన్కి బండిమాత్రం కాస్త తొందరగా పంపించు.

మన బర్రావు ఈనిందా? ఈనితే వుత్తరం రాయించే దానివేకదూ! ఈపాటికి పెద్దకొమ్ముల గేదెకూడా ఈనవొచ్చే వుండాలి—సరే. ఇంక కబుర్లేం లేవు.

—కృష్ణమోహన్.

తులసి గట్టుమీద కూర్చుని వుత్తరం చదువుతోంటే మినుములు బాగుచెయ్యటం ఆపి నవ్వుతూ వింటున్నది అన్నపూర్ణమ్మ. తులసి ఉత్తరం చదవటం కానిచ్చి దాన్ని అన్నపూర్ణమ్మ మీదకి విసిరికొట్టి "మావయ్యేప్పుడూ యింతే, నేనేం యిళ్ళట్టుకు తిరుగుతున్నాను? పచ్చీసు ఆడుకో టానికి సరసూ వాళ్ళింటి కెళ్ళాను. లేకపోతే ఉయ్యాలూగ టానికి రాజేశ్వరి దగ్గరి కెళ్ళాను. అంతేగా. ఏం? తప్పా? ఎక్కడికీ వెళ్ళకపోతే ఎలా తోస్తుందీ? నువ్వేచెప్పమ్మా!" అంటూ అమ్మమ్మ వీపుమీదపడి మెడచుట్టూ చేతులేసి ...పుతోంటే అన్నపూర్ణమ్మ అంది—"ఏమిటే ఇది? చిన్న ...ల్లలా ఈ చిలిపితనమే ఒద్దంటాడు మావయ్య. ఏదో సర్దాకి రాశాడు కానీ నీమీదేం కోపమా? నీతో సరసమాడక పోతే ఎవరితో ఆడతాడే? వచ్చాక ఎందుకన్నాడో మావయ్యనే అడుగుదువుగానీ ముందు నా వీపుమీదనుంచి లే తల్లీ - కాస్త దొడ్డి దగ్గరికి వెళ్లి అప్పన్నని పిల్చుకురా, ఉత్తరంలో సంగతులు చెపుదాం."

తులసి అమ్మమ్మ వీపుమీదనుంచి లేచి పక్కన కూర్చుంది, మినుములు ఎత్తి గుప్పిళ్లతో పోసి ఆడుతూ. చేటలో పడ్డ ఉత్తరాన్ని తులసివొళ్లో పెట్టి చేట చేతుల్లోకి తీసుకుంటూ అంది అన్నపూర్ణమ్మ "రేపేకదూ ఆదివారం. ఆ పిల్లకి మన వంటలవీ ఎలా వుంటాయో! నా కేమో అంత సుతారంగా చెయ్యటంరాదు. ఆ నాలుగు రోజులూ

కాస్త పద్మని పిలిస్తే బాగుంటుంది కదూ! బస్తీ వంటలవీ దానికి తెలుస్తాయి." తులసి మూతితిప్పి తేల్చి పారేస్తూ అంది.

"ఆ సింగినాదం, బస్తీ పిల్లయితే మాత్రం బంగారం తింటుందేమిటి! పద్మా వద్దు ఎవరూవద్దు. నేచేస్తా చూస్తో!" అన్నపూర్ణమ్మ నవ్వింది.

"పోనీలే, ఏదో ఒకటి చేద్దాం గానీ అప్పన్నని పిల్చుకురా, నీళ్ళదొడ్డి కట్టమంటాను."

"వెళ్తానుగానీ మావయ్యకి అంతా ఆరామేమిటి? సైకి ఏమీ పట్టించుకోనట్టే వుంటాడు. చీర పెట్టాలని కూడా తెల [illegible] కాబోలు!"

"అవును మరి. మొగపుటక పుడితేమాత్రం మంచి చెడ్డలు తెలియొద్దూ? ఇలాంటి సంసార విషయాలన్నీ తెలిసిన మగవాడైతే ఆడదానికెంతో సుఖం తెలుసా! అంతా నీ అదృష్టమేలే ..." తులసి నవ్వు దాచుకుంది. జడ ముందు కేసుకొని సరిజేసికుంటూ అంది_" నాకు తెలీకడుగుతాను బస్తీపిల్ల మన పల్లెటూళ్ళో ఏం చూస్తుందీ? కార్లు వుంటాయా; రైళ్ళువుంటాయా?"

"ఏమో! ఏం చూస్తుందో? నాకు మాత్రం ఏం తెలుసు? ఆ వున్న నాలుగు రోజులూ కాస్త మర్యాదగా చూసి పంపిస్తే చాలు."

"ఆ ఇందిర ఎలా వుంటుందమ్మా? బాగా మాట్లాడు తుందా?"

"నీ కన్నీ అనుమానాలేనే, మాట్లాడక పోట్లాడు తుందా? ఎలా వుంటుందేమిటీ? నీకులా వుంటుంది. కాకపోతే ఎంతైనా బస్తీపిల్ల కదూ? పైగా చదువుకుంటున్నది కాబోలు; నాజూగ్గా వుంటుంది."

తులసికి మరో అనుమానం. అమ్మమ్మ ఇందలిస్తే వూరుకోవటం ఎల్లప్పుడూ అలవాటు లేదయ్యే!

"పరాయి మగవాడితో యింకో వూరెలావస్తుందే? సిగు వెయ్యదూ? లేకపోతే భయం వెయ్యనూ?"

"ఎందుకూ భయం? మననేం మనుషులంగామూ? జతగా చదువుకునే పిల్ల కాబోలు! వాళ్ళ పెద్దవాళ్ళు కూడా ధైర్యంగా పంపుతున్నారు. పరాయివాడేమిటే? నువ్వూ సీతా క్రిందటేడాది రాఘవునితో తిరనాళ్ళ కెలా వెళ్ళావు? రోజూ వుయ్యాలదగ్గరికి పరిగెడతావ్. రాముడు వుయ్యా లూపుతుంటే నీకు సిగ్గేస్తుందా? వెధవ కబుర్లు చెప్పక లేచి వెళ్ళి అప్పన్నని పిల్చుకురా. బోలెడు పనుంది" మినుములు చేటపట్టుకు లేచింది అన్నపూర్ణమ్మ. తులసి జడకుచ్చులు తిప్పుకుంటూ దొడ్లోకి పరిగెత్తింది.



ఆదివారం సాయంత్రానికి ఆ మండువా లోగిలి మామిడి తోరణాలతో కలకలలాడుతోంది. మేడమీద గదికీ వసారాకి సున్నంకూడా వేయించింది. తులసి దగ్గరుండి రామితో, గచ్చంతా కడిగించి ముగ్గులెట్టింది. ఆ సాయం త్రం కాసిని అగరొత్తులుకూడా వెలిగించి పెట్టింది బల్లమీద.

రాత్రి భోజనంలోకి సున్నివ
వేపు దొడ్లో వేపచెట్టుకింద
తులసి హడవిడిగా తిరుగుతోం
వదిలి రావటంలేదు. అప్పన్న
కూర్చుని ఎడ్లని అదిలించాడు. ఎడ్ల
మువ్వలు మోగించుకుంటూ స్టేషన్‌కి దారి

◆ ◆ ◆

కృష్ణమోహన్ రైల్లోంచి ప్లాట్‌ఫారం మీద
చూస్తున్న అప్పన్నని కేకపెట్టాడు...

"ఒరేయ్! అప్పన్నా! ఇటు—ఇటు"

అప్పన్న పరిగెత్తాడు. కృష్ణమోహన్ రెండు పెట్టెలు, బెడ్డింగూ అందిస్తే వాటిని తీసికెళ్ళి బండిలో పెట్టి ఎడ్లని అదిలించి బండి కట్టాడు. కృష్ణమోహన్ యిందిరా స్టేషన్ పక్క పొగడచెట్టుకింద నించున్న బండిదగ్గర కొచ్చారు. రైల్లో వాళ్ళంతా చూస్తుండగా ఎడ్లబండిలో ఎక్కటం సిగ్గనిపించింది యిందిరకి. ఇందిర బాధపడనవసరం లేకుండా రైలు ఓ సారి కూతేసి నెమ్మదిగా కదిలి వెళ్ళిపోయింది. ఆ చిన్న స్టేషన్ అప్పటి కప్పుడే నిర్మానుష్యమైపోయింది. స్టేషన్ మాస్టర్ మాత్రం ఇందిరకేసి, ఎడ్లబండికేసీ చూస్తూ నిలబడ్డాడు బెంచీదగ్గర.

"ఎక్కు" అన్నాడు కృష్ణమోహన్ ఇందిరని చూస్తూ నవ్వుతూ.

"ఎలా ఎక్కాలి?" అంది ఇందిర ప్రతిగా నవ్వి.

..." కృష్ణమోహన్ చక్రం
డు.

. చీరంతా పాడై పోదూ!"

ష?" చక్రాల్నిండా బురదెందుకు
ఆవిడ చీరంతా పాడై పోదూ?" హాస్యంగా
అకున్నాడు కృష్ణమోహన్.

ప్పన్న పకాలుమన్నాడు – "రాత్రి వానపడింది
పైగా దారి సరిలేదు. లేకపోతే ఇంతగా మట్టి
మకోపోవును. బండి యిప్పేస్తాను. తొట్లోంచి ఎక్కండి
అమ్మాయిగారూ!" అంటూ అప్పన్న పగ్గాలు వూడదీసి
తొట్టి నేలమీదికి దించాడు.

ఇందిర ఎడ్లు పొడుస్తాయేమోనని భయంగా, తొట్లోంచి ఎక్కి బండిలో కూర్చుంది. అప్పన్న తిరిగీ బండికట్టాడు. కృష్ణమోహన్ చక్రంమీదనుంచి ఎక్కి తొట్లో కూర్చుని పగ్గాలు చేతిలోకి తీసుకున్నాడు. అప్పన్న ఎడ్లముందు దారి సాగించేసరికి బండికదిలింది. ఎడ్ల మెళ్ళో మువ్వలు గలగలా మోగసాగాయి. ఇందిరకి జోడెడ్ల బండి ప్రయాణం కొత్తగా వుంది. బండిలో ఒత్తుగావేసిన గడ్డిమీద తుంగచాప, పైన దట్టంగా గూడు! తడికకానుకు కూర్చుని కృష్ణమోహన్ బండి తోలటం చూస్తోంది ఇందిర.

"మీ కోసం అమ్మగారూ, తులశమ్మగారూ తెగ హడావిడి చేసేస్తున్నారండీ అబ్బాయిగారూ." అన్నాడు అప్పన్న ముందు నడుస్తూ.

"తులసి హడావిడికేంలే. ఉరుకులూ! పరుగులూ!
కాస్తంతని గంపంత చేసేస్తుంది.'

ఈ పాటికి వూరంతా చాటేసి వుంటుంది శుభవార్త!"

బండి పొలాలమధ్య పడింది. ఏపుగా ఎదిగిన వరికర్రలు గాలికి హాయిగా తలలూపుతున్నాయి. కన్నానినంతమేరా పచ్చటి వరిచేలు! ఇందిర వింతగా చూస్తోంది పొలాలకేసి.

"టాపులేక పోతే బావుండేది." అంది అప్రయత్నంగా దూరంగా చూస్తూ.

కృష్ణమోహన్ నవ్వాడు. "టాపు కాదిది ఇందిరా! గూడు! నువ్వు మీ పట్నానికీ, కాలేజీకి దూరంగా నిజమైన ప్రకృతి సౌందర్యాల్ని చూడ్డానికొస్తున్నావు. ఈ నాలుగు రోజులూ ఆ ఇంగ్లీషుముక్కలూ, సిటీ మేనర్సూ మర్చి పోవాలి. నువ్వన్నట్టు గూడు లేకపోతేనే బావుండేది. కాని నాలుగు చినుకులుపడితే మాక్కేంగానీ నువ్వు నాని పోతావ్. అసలే మీ వాళ్ళంతా జాగ్రత్తంటూ ఏకరభస! నీకే రొంపైనా పడితే నాను చేస్తారు వైద్యం—ఒరేయ్ అప్పన్నా! గూడు తీసేదాంరా? అమ్మాయిగారికి పొలాలు సరిగా కన్పించటంలేదట."

"వద్దయ్యా! వానొస్తుంది."

"బండింత ఖాళీగా వుంటే అతను నడవటందేనికీ?" సానుభూతిగా అంది ఇందిర.

"ఒరేయ్ అప్పన్నా! నువ్వు నడవ కూడదట్రోయ్. పాపం ఈ బుల్లెమ్మగారిది జాలిగుండె. వచ్చి తోట్లోకూర్చో. నే లోపలికెళ్తా."

"మాటికి ముందిలా ఎక్కిరిస్తే నే నసలురాను. స్టేషన్ దగ్గర దింపెయ్ మా వ్వూరు పోతాను." అంది ఇందిర మూతి ముడుచుకుని చిరుకోపంగానే.

కృష్ణమోహన్ నవ్వాడు. "ఆడవాళ్ళు అలిగితే అందం సుమా!"

ఇందిర విన్పించుకోనట్లు దూరంగా జోగే పొలాల మీదికి చూపు మరల్చి కాళ్ళ చుట్టూ చేతులు చుట్టుకుని ముడుచుకు కూర్చుంది. చూస్తుండగానే సన్నగా జల్లు ప్రారంభమైంది. అప్పన్న తలపాగా వూడదీసి తలమీద కప్పుకోవటం చూసింది ఇందిర.

"అతను వర్షంలో తడిసిపోవటం లేదూ? అలా ఆ బురదలో ఎంత సేపని నడుస్తాడు! పెట్టెలు తోట్లో దేనికి? బెడ్డింగయినా లోపలపెట్టు. వర్షం రావటం తెలుస్తోందా అసలు?"

"బాబోయ్! ఏవిటీ సాధింపూ? వాటిమీద ఒంక పెట్టకపోతే చలేస్తోంది లోపలికి రమ్మంటే రానూ?—" ఇందిర కృష్ణమోహన్ కళ్ళలోకి కోపంగా చురుగ్గా చూసింది.

"ఎందుకంత కోపం? నే నేమన్నాననీ?"

"చాల్లే. మాటలు నేర్చావ్" కృష్ణమోహన్ బండి ఆపు చేశాడు.

"ఒరేయ్! అప్పన్నా! వర్షం జోరయ్యేలా వుందిరా! తొట్లోకిరా! నే లోపల కూర్చుంటా" అన్నాడు కృష్ణ మోహన్. పెట్టెలు, బెడ్డింగ్ లోపలపెట్టి బెడ్డింగ్ మీద కూర్చున్నాడు. అప్పన్న తొట్లోంచి కాస్త గడ్డిలాగి బురదంతా తుడుచుకొని తొట్లో ఎక్కాడు.

వర్షం జోరైంది. చలిగాలి రయ్యిమని ఎడాపెడా విసురుతోంటే ఇందిర పైటచెంగు తలమీదుగా వేసి చెవులు కప్పుకుని కూర్చుంది, గడిచివచ్చిన దారిమీద బురదలో బండి చక్రాల చాళ్ళు చూస్తూ.

"ముసుగులో నిన్నెప్పుడూ చూళ్ళేదు ఇందూ! అర్ధ గ్రహణం పట్టిన చంద్రబింబంలా......" అన్నాడు కృష్ణమోహన్. ఇందిర చాపమీద చూపు గుచ్చింది.

"నువ్విలా సాధిస్తావని తెలిస్తే నే నసలు రాకపోదును" ఎక్కడ అప్పన్నకి వినపడుతుందోననే భయంతో చాల నెమ్మదిగా అంది ఇందిర, దగ్గరగా జరిగికూర్చున్న కృష్ణమోహన్ కి దూరంగా జరుగుతూ.

"అరెరె. పడిపోతావ్ మరీ జరక్కు. నీ కెంతైనా పుణ్యం, "నే నేం అనన్లే-ఓరేయ్ అప్పన్నా! కాస్త హుషార్ గా పోనీయ్ రా! ఈ చలిగాలికి రొంపపడితే చచ్చేయాతన."

అప్పన్న ఓసారి ఎడ్లనదిలించి ఏదో పాటందుకున్నాడు. అప్పన్నపాటకి, మువ్వల మోతకీ జతకలిసింది. ఇందిర చాలా

సేపు కూర్చుంది ఆలోచిస్తూ. కృష్ణమోహన్ కర్చీఫ్ తీసి చెవులకి కప్పుకుని ఇందిర్ని చూస్తూ కూర్చున్నాడు.

"ఇంకా ఎంతసేపు?" ఉలిక్కి పడుతూ అడిగింది ఇందిర కృష్ణమోహన్ కళ్ళలోకి చూస్తూ— "ఏమో నాకూ తెలీదు" అన్నాడు కృష్ణమోహన్ మొహం అప్పన్నకేసి తిప్పి ఇందిర నవ్వింది— "ఏమోయ్ అప్పన్నా! ఇంకా ఎంతసేపు పడుతుందీ?" అంది ఇందిర గట్టిగా. అప్పన్న బండిలోకి చూసి చెప్పాడు—"వచ్చేశాం అమ్మాయిగారూ! మరి పది బారలుంటుం దంతే." అన్నాడు.

ఇందిరకేం అర్థం కాలేదు. కృష్ణమోహన్‌కి నవ్వొచ్చింది.

"అలా చెప్తే బస్తీ పిల్లకేం తెలుస్తుందిరా? ఇంకా ఎంత టైం పడుతుందో చెప్పాలి" అన్నాడు ఇందిరకేసి వారగా చూస్తూ.

"అది నాకెలా తెలుస్తది బాబూ? మీరు చెప్పండి" అన్నాడు అప్పన్న.

"ఇంకా ఐదు గంటలు పడుతుంది. అంటే తెల్లారు జాముకి చేరుకుంటాం. ఏం విసుగ్గావుందా? సుజాతా వాళ్ళ కార్లో పక్కన నడిచేవాళ్ళ బట్టల మీద బురద చిందులు పడేలా దూసుకుపోతున్నట్టు లేదూ?"

"అహ్హా! కృష్ణమోహన్ బండిలో కుదుపులు తింటున్నట్టు వుంది." అప్పన్న ఫక్కుమన్నాడు— "మా భలే

చెప్పారు. తులశమ్మగారూ యింతే. మాటకి మాట!— ఆఁ, వచ్చేశాం లెండి అమ్మాయిగారూ! ఆ కనపడేదే వూరు."

అప్పన్న మరోసారి అదిలించాడు ఎడ్లని—కాస్సేప్పటికి బండి వూళ్ళో ప్రవేశించింది. బాగా చీకటి పడిపోయింది. పైగా మబ్బుల మయం! కారు చీకటిగావుంది. అక్కడో దీపం, ఇక్కడో దీపం ఇళ్ళల్లోంచి మినుకు మినుకుమంటూ కనిపిస్తున్నాయి— అప్పన్న తొట్లోంచి కిందికి దిగి నడుస్తున్నాడు.

"నా కేమిటో భయంగా వుంది" అంది ఇందిర బెరుగ్గా కృష్ణమోహన్ దగ్గరికి జరిగి—"ఛ, ఎందుకా భయం! నేను లేనూ? నీకేం ఫర్వాలేదు. మా అమ్మ చాలామంచిది ఇందూ!" చీకట్లో ఇందిర తల నిమిరి ధైర్యం చెప్పాడు.

"వీధి గుమ్మం దగ్గర ఆపమంటారా; దొడ్లోకి పోనిమ్మంటారా?" అప్పన్న అడుగుతూంటే వీధరుగుమీద నించున్న అన్నపూర్ణమ్మ కలగజేసుకుని అంది—

"ఈ చీకట్లో దొడ్లో కెందుకురా? ఇక్కడే ఆపు జెయ్యి. సామానేదైనా వుంటే లోపల పెట్టు. ఏడీ కృష్ణ దిగడేం?"

కృష్ణ దిగాడు. అప్పన్న సామాను తీసికెళ్ళి చావిట్లో పెట్టి వచ్చాడు. ఇందిర దిగటానికి తికమక పడిపోతూంది. వాళ్ళమ్మ అక్కడ లేకపోతే ఏదైనా అనేవాడే కృష్ణ. లేకపోతే చెయ్యయినా అందించును.

"ఒరేయ్ అప్పన్నా! చావిట్లో కుర్చీపీటవుంది. తెచ్చి వెయ్యిరా?" అంది తులసి. అప్పన్న చావిట్లోకి పరిగెత్తాడు— ఇందిర పీటమీద కాళ్ళెట్టి నెమ్మదిగా కిందికి దిగి నించుంది.

"రామ్మా లోపలికి" అనునయంగా పిలిచింది అన్నపూర్ణమ్మ. ఇందిర కృష్ణమోహన్ వెనక నడుస్తూ చావిట్లో కొచ్చింది.

"అప్పన్నా! ఎడ్లని సావిటిలో కట్టి గడ్డిపడేసి తొంద రగా రా! స్నానానికి నీళ్ళు తోడుదువుగాని" అని దొడ్లోకి బండి తోలుకెళ్తున్న అప్పన్నకి చెప్పి చావిటిలో కొచ్చింది అన్నపూర్ణమ్మ.

"బట్టలవీ తీసుకోండి కృష్ణా! నీళ్ళు కాగివున్నాయి స్నానాలు చేద్దురుగాని."

"ఆఁ చేద్దాంగాని—ఏం తులసీ కులాసా? అలా మూతి ముడుచుకు నించున్నావేం?" తులసి నిర్లక్ష్యంగా తల తిప్పు కుంది. అన్నపూర్ణమ్మ నవ్వుతూ అంది— "ఇళ్ళెట్టుకు తిరుగు తుందని రాశావట ఉత్తరంలో, అందుకూ ఆ కోపం"

"అదా కథ? మరి తిరగని వాళ్ళకి కోపం దేనికి? పోనీలే నువ్వు చాలా మంచిదానివి. ఇంత మంచి పిల్లని వృత్తి పున్యానికి అన్నందుకు లెంపలేసుకుంటాను. నీకు మంచి పుస్త కాలూ చీరలూ తెచ్చాను తీసుకో" అంటూ పెట్టె తెరచి పుస్తకాలూ చీరలూ తీసి తులసి కందించబోతే పుచ్చు కోకుండా అంది తులసి పెడసరంగా— "నాకేం అక్కర్లేదు."

అన్నపూర్ణమ్మ మందలించింది– "ఛ! ఏమిటి తులసీ? ఏదో సర్దాగా అన్నందుకంత పట్టుదల? మావయ్య సర్దాగా నీకోసం తెస్తే తీసుకోవేం? నీకు తెచ్చాడుగానీ నాకు తెచ్చాడా?" నవ్వింది– "ఐనా దాని దగ్గర మంచి మంచి చీరలుండగా నువ్వు వేరే తేవటం ఎందుకు కృష్ణా? కావలిస్తే వాటిల్లో దొకటి..."

"ఏమో! ఇది పరికిణీలు కడుతుందిగా! చీర లుంటా యనుకోలేదు" అన్నాడు కృష్ణ.

"అంతేనా? నాకు చీరలేం పనికొస్తాయనుకొన్నావా" అంటూ వాటి నందుకుంది తులసి.

"రెండూను" పెట్టెలోంచి తుండుతీసుకుంటూ అన్నాడు కృష్ణమోహన్.

ఆ సంభాషణ ఇందిర కేం అంతుపట్టలేదు. తలుపు నానుకొని నించుంది.

"నువ్వు స్నానం చేస్తావా ఇందిరా?" కృష్ణమోహన్ ఇందిర నడిగాడు.

"పైనుంచి వర్షం పడుతోంటే దొడ్లో ఎలా స్నానం చేస్తుంది? నువ్వయితే ఏ చూరుకిందో పోసుకొస్తావు కావా లంటే తవిశ కూడా ఆ చూరుకిందే పోసుకోవాలి" అంది తులసి.

"ఐతే ఎలా? పోనీలే మానెయ్. మధ్యాన్నమేగా స్నానం చేసింది? చలిగా కూడా వుంది" కృష్ణమోహన్ ఇందిరని చూశాడు. ఇందిర మౌనం ధరించింది.

"తులసీ! గదిలోకి తీసికెళ్ళి కూర్చోబెట్టు మావయ్య స్నానం చేశాక భోంచేద్దురుగాని" అంది అన్నపూర్ణమ్మ లోపలి కెళ్తూ.

తులసి ఇందిరని దక్షిణంవేపు గదిలోకి తీసికెళ్ళి మంచం మీద కూర్చోమని లోపలి కెళ్ళి పెద్ద చెంబుతో వేన్నీళ్ళు తెచ్చి దొడ్డి చీడీలమీద పెట్టి "కాళ్ళు కడుక్కో" అంది.

ఇందిర కాళ్ళు కడుక్కు వచ్చి తులసి చెప్పిన ప్రకారం మంచంమీద కూర్చుంది గది అంతా కలియజూస్తూ. తులసి కూడా మావయ్య తెచ్చిన పుస్తకాలు దీపంబుడ్డి దగ్గరికి జరుపుకుని తిరగేస్తూ కూర్చుంది. ఇందిర అన్ని వస్తువుల్నీ చూస్తూ తులసిని దీక్షగా చూడసాగింది. తులసి యింత అందంగా వుంటుందనుకోలేదు సుమా తను! దృఢంగా వుంది. మంచి పెర్సనాలిటీ! మోకాలు కుచ్చెళ్ళ పరికిణీ. ఓహ్! చేతులకి బంగారపు గాజులమధ్య నిండుగా మట్టి గాజులు! కాళ్ళకి చక్కటి మువ్వల పట్టాలు! మెళ్ళో కాస్త పొడుగనిపించే మూడు వరసల చంద్రహారం! బారెడు జడకి పొట్టి కుచ్చులు! చెవులకి చిన్న జూకాలు! – "పల్లెపడుచు" అనుకుంది ఇందిర తదేకంగా చూస్తూ.

తులసి కూడా ఇందిర మీద ఒక్కో చూపు విసురుస్తూ పుస్తకాలు తిరగేస్తోంది. పల్చటి సిల్కు చీర! చేతులకి రెండేసి బంగారు గాజులు! ఎడం చేతికి రాళ్ళ ఉంగరం! చెవుకి ఒకే రాతిజోడు! మెళ్ళో సన్నటి గొలుసు! తన జడంత బారు కాకపోయినా పొడుగనిపించే నొక్కు జుట్టు!

సన్నగా నాజూకైన శరీరం! – "ఎంతైనా బస్తీ పిల్లకదూ? నాజూగ్గా వుంది. అందగత్తె" అనుకుంది తులసి. అలా మౌనంగా కూర్చోవటం ఇందిర కెలా వున్నా తులసికి దుర్భరంగా వుండి మాటల్లోకి దించింది—"నువ్వేనా మా మావయ్య చదువేనా?"

"అవును. నువ్వేం చదువుకున్నావ్?" అంది వెంటనే ఇందిర సమయంకోసం కాచిపెట్టుకు కూర్చున్నట్టు. తులసి తేలిగ్గా తోసి పారేస్తూ "ఆ నేనేం చదువుకున్నానూ? ఏదో పల్లెటూరి చదువు. మా మావయ్యే అప్పుడప్పుడూ పుస్తకాలు తెస్తూంటాడు. అందుకనే ఇటువంటివన్నీ చదివి అర్థంచేసుకోగలను."

"ఇక్కడ చదువై పోగానే మీ మావయ్యతోపాటు బస్తీలో చదువుకోలేక పోయావా?"

"అప్పుడు మావయ్యకే గగనమై పోయింది బస్తీ చదువుకు వెళ్ళటం. మా అమ్మ కిష్టముండేది కాదు బస్తీ కెళ్ళటం. ఐనా ఎలాగో వెళ్ళాడు. అప్పుడప్పుడూ నన్నూ చదివించాలనేవాడు. మా అమ్మకి ఇంట్లో సాయంగా వుండాలనీ, ఆడపిల్లని బస్తీలో వుంచటానికి బోలెడు శ్రమపడాలనీ– ఏదైతేనేం; మా పల్లెటూరి వాళ్ళకి చదువు లెలా అంటు తాయి!" అంది తులసి చదువుకోవాలనే కాంక్ష తనకీ వుండేదని బాధపడుతూ.

"అవును. అందరికీ చదువుకునే సౌకర్యాలులేవు. ఊళ్ళోనే స్కూళ్ళూ కాలేజీలు ఉండబట్టిగానీ లేకపోతే

మాగతీ యింతే. ఎంతైనా మన పెద్దవాళ్ళకి ఆడ పిల్లలు చదువుకోటం అంత యిష్టముండటంలేదు. ఎంతైనా ఖర్చు పెట్టి చదవించుకోగల స్తోమతుండి కూడా ఏమిటో నిర్లక్ష్యం". ఇందిర సానుభూతిగా అంది నెమ్మదిగా.

"మీ బస్తీవాళ్ళదృష్టవంతులు" అంది తులసినవ్వుతూ. ఇందిర మౌనంగా వూరుకుంది. —"అమ్మాయ్! తులసి! అన్నాలకి రండి. మావయ్య వచ్చాడు." అంటూ అన్న పూర్ణమ్మ కేకవెయ్యగానే తులసి లేచి నుంచుంది. ఇందిరని వెంటబెట్టుకు వడమటింటిలోకి వెళ్ళింది.

భోజనాల దగ్గర కృష్ణమోహన్‌కి చెరోవైపు ఇందిరా, తులసీ! అన్నపూర్ణమ్మ ఇందిరకి అప్పన్న కోసితెచ్చిన అరిటాకులో వడ్డించబోతూంటే కృష్ణమోహన్ వారించాడు.

"మరేం ఫర్వాలేదు. పళ్ళెంలో పెట్టెయ్యి. వెండిదే కదూ! అంటు వుండదు. ఏం ఇందిరా? నువ్వు ఆకులో తింటానంటే మేమిద్దరం కూడా ఆకులోనే."

"అవును మావయ్యా!" అంది తులసి. ఇందిర నవ్వింది. అన్నపూర్ణమ్మ మూడు వెండి పళ్లేలలో వడ్డించింది. పళ్ళెంలో ఒకవైపు వీశరాళ్ళలాంటి రెండు సున్నివుండలూ; మరోవైపు గిన్నెడు పులిహోరా! "వచ్చింది పల్లెటూరు కాబట్టి మావంటలన్నీ తినటం నేర్చుకోవాలి." అంది తులసి నెయ్యి వేయించుకుంటూ.

"తినటమేగాదు. వండడం కూడా నేర్చుకోవాలి" అన్నాడు కృష్ణమోహన్ ఇందిర మొహంలోకి చూస్తూ.

ఇందిర ఆ రెండు సున్నివుండలూ ఎలాగూ తినలేదు కాబట్టి ఎంగిలి చెయ్యకుండా తీసివెయ్యాలని తటపటాయిస్తూ అవి రెండూ తీసి తులసి పళ్ళెంలో పెడుతూ అంది— "నేను తినలేను."

"అదేమి టమ్మాయ్! ఒకటైనా తీసుకో" అంది అన్నపూర్ణమ్మ మందలింపుగా.

"అసలు చేసింది నీ కోసం నువ్వు తినకపోతే మేమెలా తింటాం?" అంది తులసి తిరిగియిస్తూ. ఇందిర చెయ్యి అడ్డం పెట్టి దాదాపు బ్రతిమాలు తున్నట్టే అంది- "లేదు తులసీ! ఇప్పుడు తిన్లేను."

"పోనీలే తులసీ! బలవంతం దేనికి?" అన్నాడు కృష్ణమోహన్ ఇందిర స్థితి అర్థం చేసుకుని.

"బస్తీవాళ్ళు నాజూగ్గా తింటారు కాబోలు" అంది తులసి వేళాకోళంగా.

"అవును మరి మనలా—అందులోనూ నీలాతింటారా మరి?" కృష్ణమోహన్ విసురికి తులసికి పౌరుషం పొడుచుకు వచ్చింది. "అది నాజూకు కాదోయ్ మావయ్యా! తిని హరాయించుకోగల శక్తి వుండొద్దూ? కాస్త తింటే కడుపు నొప్పే తెల్లారి డాక్టర్లూ! మీ బస్తీవాళ్ళ బడాయిల కేంలే!"

"చూశావ్ ఇందిరా? తులసి ఎలా మాటకిమాట అప్పచెప్పిందో!"

"అవును మరి! అంతా నాలా వుంటారేం!" అంది ఇందిర. తులసి ఫక్కుమంది.

"ఓడిపోయాడోయ్! మేమిద్దరం; నువ్వొక్కడివే" అంది.

"కాదులే. మేమూ ఇద్దరం. మా అమ్మ లేదూ?"

ఇందిర కాస్త పులిహోర తిన్నాక చెయ్యి కడిగేసుకుంది.

"అదేవిటీ? అన్నం నడిపించుకోవ్వా?" అడిగింది. అన్నపూర్ణమ్మ ఆప్యాయంగా.

"వద్దండి! ఇదే ఎక్కువైపోయింది" అంది ఇందిర.

"పోనీ పెరుగు పొయ్యమ్మా వేరే పళ్ళెంలో" అంది తులసి.

"పెరుగసలు వద్దు. రాత్రిళ్ళు పెరుగు వేసుకోము." అంది ఇందిర.

"భలే మనుషులే! ఏమీ తినకపోతే మీరు తినేదేమిటి?" అంది సాగదీస్తూ తులసి.

అన్నపూర్ణమ్మ వంటశాలలో కెళ్ళి దాలిమీద కాగుతున్న పాలు వెండిగ్లాసుడు తెచ్చి చల్లార్చి పంచదార వేసి బలవంతంగా యిచ్చింది. బాగుండదని ఇందిర పాలు తీసుకుని తాగుతూ కూర్చుంది పీటమీద.

"అయితే మాకూ పాలే పొయ్యి" మారాం చేస్తున్నట్టు అన్నాడు కృష్ణమోహన్ పళ్ళెం ఖాళీచేసి—"నువ్వెంత పేచీ పెట్టినా లాభం లేదు మావయ్యా! మనం పాలు తాగేస్తే రేపొద్దుటికి పెరుగు నాస్తి. ఆవు ఈనేవరకూ ఇందిర కొక్కదానికే పాలు."

అన్నపూర్ణమ్మ ఇద్దరి పళ్ళెలనిండా పెరుగుపోసింది.

"అయితే మావయ్యా! ఈ వానాకాలం ఏం చూస్తారూ? ఏక బురద! జోరుమంటూ వాన! వేసంకాల మైతే హాయిగా వుండేది కాదూ?" అంది తులసి పెరుగన్నం తింటూ.

"తెలివి తెల్లారినట్టే వుందిలే. అసలు పల్లెటూళ్ళు చూడాల్సిందే వర్షాకాలం. వేసవికాలం ఏం వుంటుందీ! నిద్రపోయే ప్రకృతి మేల్కొంటుంది తులసీ ఈ బుతువులో."

"ప్రకృతంటే ఏమిటి మావయ్యా!" అంది తులసి చిలిపిగా చూస్తూ. ఏం చెపుతాడోనని ఇందిర పెదాలు బిగబట్టి చూస్తూ కూర్చుంది. కృష్ణమోహన్ తటపటాయించాడు.

"ఇప్పుడు చెప్పను. రేపు చూపిస్తాను"

"చెప్పటం చేతగాకపోతే సరి..." అంది పక్కుమని నవ్వుతూ తులసి. ఇందిర పైట అడ్డు పెట్టుకుంది నవ్వుతూ.

"చాల్లే పళ్లేలు తీసేస్తాగానీ అమ్మాయిని పైకి తీసికెళ్ళు. పొద్దుపోయింది." అంది అన్నపూర్ణమ్మ మంద లింపుగా. తులసి చెయ్యికడుక్కుని లేచి, ఇందిరని పై తీసు కెళ్ళింది. గదీ, వసారా విశాలంగా పరిశుభ్రం ఉన్నాయి. కొత్తగా సున్నం వేసినఘాటు! వెలుగుతూన్న అగరొత్తుల సువాసన! మామిడి తోరణాల పరిమళం! వింతగా వుంది. రెండు మంచాలమీద తెల్లటి పక్కలు!

కిటికీదగ్గర బల్లమీాద ఇందిర పెట్టె! ఇందిర కిటికీ తీసిచూస్తూ నించుంది. కారుచీకటి! కొత్తప్రదేశం. ఏమిా కన్పించటం లేదు. ఐనా కన్నానినంతవరకూ పేరుకు పోయివున్న చీకటీ లీలగా కన్పించే చెట్లూ చూడాలనిపించింది. "కిటికీ తీసివుంచితే జల్లుకొడుతుంది గదిలోకి" అంది తులసి తలగడనానుకు కూర్చొంటూ. ఇందిర కిటికీమూసి వచ్చి మంచంమిాద కూర్చుంది—"కృష్ణమోహన్ అమ్మగార్ని నువ్వూ అమ్మా అంటావేం?" అంది ఎంతో సేపట్నుంచి ఉన్న అనుమానాన్ని తీర్చుకోవాలన్నట్టుగా.

"చిన్నప్పట్నుంచి అదే అలవాటు! మావయ్య ఇంట్లో అలానే పిలుస్తూంటే నాకూ అలవాటైపోయింది. మా అమ్మని నే నసలు ఎరగను. చిన్నప్పుడే..."

"అవునట మిా మావయ్య చెప్పాడు. మిా నాన్నగారు ఎప్పుడైనా వస్తుంటారా?"

"ఆ, నేనూ వెళుతుంటాను. మా పిన్ని చాలామంచిది. ఐనా మా అమ్మ నన్నిక్కడే వుంచుకొంది. నా బాధ్యతంతా వీళ్ళదే. మా అమ్మకి పదెకరాలిచ్చారు. అవి నావే. మావయ్యే చేయిస్తున్నాడు. ఈ ఏడాది నాడబ్బుపెట్టి మరో ఇద్దెకరాలు కొంటారట."

"నీకు నగలేం ఉన్నాయి?" అడిగింది ఇందిర కుతూహలంగా.

"ఇంకా ఏం లేవు కానీ చేయించుకుంటాను. మా అమ్మే అశ్రద్ధ చేస్తోంది" అంది తులసి

"ఇంతవరకూ చిన్నదానివని పూరుకున్నారులే. నీకు చాలా డబ్బుంది కాబట్టి మువ్వల వడ్డాణం_రవ్వల అరవంకీ_ పావుకాసుల పేరూ—చక్కటి నెక్లెస్‌లూ అన్నీ చేయించుకో" అంది ఇందిర నవ్వుతూ తులసికూడా నవ్వుతూ—"నిజంగా అంటున్నావా; వేళాకోళమా ? బస్తీవాళ్ళు కటువంటి నగలు చేయించుకోమని సలహాయిస్తారా ?" అడిగింది— "నిజం తులసీ! నా కటువంటి నగలు చాలా యిష్టం. నీలాంటి పల్లెపడుచు అటువంటి నగల్లో మునిగి ఉంటే సాక్షాత్తూ లక్ష్మిలా ఉంటుంది. నగలు ఉండడం ఆడదానికి పెద్ద అండకూడా" అంది ఇందిర.

"సరేగానీ బస్తీ పిల్లలు వాచీలు పెట్టుకుంటారు; బూట్లు వేసుకుంటారని చెప్తాడు మానయ్య. మరి నీకు..."

"ఉన్నాయి. కానీ తెచ్చుకోలేదు. అవన్నీ చూస్తే మీ పల్లెటూరి వాళ్ళేమనుకుంటారోనని భయపడ్డాను."— ఇందిరకీ, తులసికీ చాలసేపు సంభాషణ జరిగింది. తులసిది సహృదయం—స్నేహగుణం అని అర్థం చేసుకుంది ఇందిర. పెద్ద చదువులు మానయ్యతో సమానంగా చదువుకునే బస్తీ పిల్ల తనతో అంత సన్నిహితంగా మెలగటం తులసికి చాలా గర్వంగా, సంతోషంగా ఉంది— పల్లెటూళ్ళ ఆడవాళ్ళు అసభ్యతగా మోటుగా ప్రవర్తిస్తారేమోనని భయపడిన ఇందిర మనసు అన్నపూర్ణమ్మ ఆప్యాయతకి, తులసి అనురాగానికి కుదుటపడింది. ఆ రాత్రి కొత్త వాతావరణంలోనైనా హాయిగా నిద్రపోయింది.

♦ ♦ ♦

కోడి కూతల జోరుకి ఇందిరకి మెలకువ వచ్చి ఉలిక్కిపడ్డట్టు లేచి కూర్చుంది. తులసి లేదు. పక్క చుట్టివుంది. దీపం చిన్నగా వెలుగుతోంది. లేచి కిటికీ తెరచి చూస్తూ నించుంది. తెల్లగా తెల్లారిపోలేదు. ఎత్తుమీదనుంచి చూసే వాళ్ళకి చింత గుబుర్లోంచి వస్తున్న లేత భాను కిరణాలూ అరుణరాగ రంజితమైన సూర్యబింబం ప్రశాంతంగా వుంది. మనోహరమైన సూర్యోదయానికి చింతకొమ్మల మీదనుంచి పక్షులు కలకలా కూస్తూ మత్తుగా ఆకాశంలో ఎగురుతున్నాయి. అదే చింతకింద తడి ఇసకలో నలుగు రైదుగురు పిల్లలు బొమ్మరిళ్ళూ, పిచ్చిక గూళ్ళూ కట్టుకుంటున్నారు. ఎవరింటి గుమ్మంలో ఒక అమ్మాయి ముగ్గు పెడుతోంది. అరుగుపక్కన ఓ ఆసామీ మొహం కడుక్కుంటున్నాడు. పచ్చెళ్ళు పైకి పెట్టుకుని, భుజం మీద బిందె పెట్టుకొని వయ్యారంగా నడిచి వెళుతున్న యిద్దరు యువతుల్ని వేరుచేసి మధ్యనుంచి విసురుగా వస్తున్నాడో నీళ్ళకావిడి మనిషి. రోడ్డని చెప్పబడే ఆ దారంతా బురదగా ఉన్నప్పటికీ అంతా ఆ బురదలోనే తిరుగుతున్నారు హడావిడిగా. రాత్రి అతి నిశ్శబ్దంగా ఉన్న ఆ వాతావరణ మంతా తెల్లవారకుండానే సందడితో నిండిపోయింది.

"పల్లెటూళ్ళలో పెందలాడే లేస్తారు. తొందరగా పడుకుంటారు" అనుకుంది. ఇందిర పక్క చుడుతూంటే తులసి వచ్చింది.

"నువ్వెప్పు డెళ్ళిపోయావు ? అంత తొందరగా లేచి ఏం చేస్తావూ?" అంది ఇందిర.

"ఏం చెయ్యట మేమిటి? తొందరగా లేవకపోతే ఇంట్లో పనెలా ఔతుంది? రాము వాకిళ్ళూడిచి కళ్ళాపేస్తే నే ముగ్గు పెడతాను. అది అంట్లుతోమితే కడుగుతాను. తర్వాత గదులు నేనే వూడుస్తాను. మజ్జిగ మా అమ్మే చేస్తుందనుకో. ఒక్కోసారి నే కూడా చేస్తాను.

"మొహం గడుక్కోవాలి. పొయ్యిదగ్గర కాస్తో కూస్తో పని వుంటుంది. ఇవన్నీ ఎప్పుడౌతాయి ఆలస్యంగా లేస్తే. మేం మీ బస్తీ వాళ్ళలా అన్నిటికీ పని మనుషుల్ని పెట్టుకోము. ఇంట్లో ఆడవాళ్ళ ముండి ఏం చెయ్యాలి ?—ఐనా పొద్దెక్కేవరకూ పడుకోబుద్ధికాదు—ఆఁ నువ్వు మొహం కడుక్కుంటావా ; ఇంకాస్సేపు పడుకుంటావా ?" అంది తులసి నవ్వుతూ.

"మళ్ళా పడుకుంటే నువ్వూరుకోవులే పద "

"ఐతే బ్రష్ అదీ వుంటుంది కాబోలు తెచ్చుకో, నీ పెట్టె యిక్కడే ఉంది."

"తీసుకురాలేదు. ఇక్కడున్నప్పు డన్నీ యిక్కడి పద్ధతులే."

"అయితే బట్టలు తెచ్చుకో, నీళ్ళు కాగివున్నాయి. లేకపోతే నా పరికిణీలు కట్టుకుంటావా ?"

"అవి నీకే బావుంటాయి తులసీ ?" బట్టలు తీసుకు కిందికి వెళ్ళింది ఇందిర తులసితో.

వేపచెట్టుకింద దడిదొడ్లో స్నానంచేసి గదిలోకొచ్చి చీరకట్టుకుంటూంటే తులసి వుప్మా, కాఫీ తీసుకొచ్చింది యిద్దరికీ.

"పొద్దుటె ఎందుకిదంతా? నా గురించి ఆర్భాటమేమీ వద్దు తులసీ! నేనూ మీలానే వుంటాను." అంది ఇందిర నొచ్చుకుంటున్నట్టు.

"అబ్బే! ఆర్భాట మేముందీ! మావయ్య కేలాగూ చెయ్యాలి కదా!"

"అన్నట్టు కృష్ణమోహన్ ఇంకా లేవలేదూ? అతనినీ రానివ్వక పోయానా?"

"ఆయనగారు నిక్కీ నీలిగీ వచ్చేసరికి మన పని ఖాళీ! తిందూ! అన్నట్టు ఈ అరటిపండు ముందు తిను. ఇది నా తులసి ప్రసాదం."

"నువ్వు తులసిపూజ చేస్తావా? కోట ఎక్కడుందీ?"

"పడమటి దొడ్లోవుంది, చూపిస్తాను. కాఫీ చల్లారి పోతూంది." తులసి హెచ్చరించటంతో ఇందిర తిండి కుపక్ర మించింది. కాఫీ మాత్రం డబుల్ స్ట్రాంగ్‌గా వుంది.

కృష్ణమోహన్ ఆవలిస్తూ వచ్చాడు_"ఏమి టేమిటీ! ఇంత ప్రొద్దుటే ఇందిరాదేవి లేవటం—స్నానం—టిఫిన్ అన్నీ ఆశ్చర్యంగా వుందే!" ఆశ్చర్యపడ్డాడు.

"తులసి సావాసం" నవ్వింది ఇందిర కాఫీతాగుతూ.

"నిన్నుచూసి తులసే మారిపోతుం దనుకున్నాను. తులసిని చూసే నువ్వు మారుతున్నావన్నమాట. సరే! తులసీ

నీ అలవాట్లన్నీ ఇందిరకి నేర్పెయ్. ముందు ముందు పని కొస్తాయి" అన్నాడు కృష్ణమోహన్ ఇందిర మొహంలోకి చూస్తూ. ఇందిర చూపు తిప్పుకుంది.

"నా అలవాట్లేమున్నాయిలే మావయ్యా! రెండేసి పళ్ళేలు తినటమేగా!"

"ఇందిరా! దీనికి కోపం జాస్తీ! నోరు జారిందో పీకకట్టేసుకుంటుంది. నేనూ స్నానం చేసివస్తా" కృష్ణమోహన్ దొడ్లోకి వెళ్ళాడు. తులసి గ్లాసులూ, ప్లేట్లూ తీసుకువెళ్తూ ఇందిర కూడా రమ్మంది. ఇందిర తులసి కోటదగ్గర నుంచుని దొడ్డంతా చూసింది. దొడ్డి చాలా విశాలంగా వుంది. నాలుగైదు నారింజచెట్లూ, కరివేపాకు చెట్లూ, రెండు మూడు వేపమొక్కలూ వున్నాయి. బంతిచెట్లూ విపరీతంగా వున్నాయి దొడ్డినిండా. వంట పాకమీదికి పాదులు దట్టంగా అల్లుకున్నాయి. కొన్ని పాదులు పందిరిమీదకూడా పాకి వున్నాయి. అరటిచెట్లుకూడా చాలా వున్నాయి. వర్షాకాలం కావటంచేత దొడ్డంతా బురదగా వుంది.

అప్పన్న కోడిపుంజుని తరిమి తరిమి పట్టుకొంటూంటే నూతిగట్టు మీద మొహం కడుక్కుంటూ అడిగాడు కృష్ణమోహన్— "పవిత్రోయ్ అప్పన్నా! ఎందు కదీ?"

"బస్తీలో అలసిపోయి వచ్చావు. విందు చేద్దామని" అంది తులసి గ్లాసులు కడిగి తీసుకెళుతూ.

"పేను నాదీ, తిండి నీదీ లే. కానీ ఆవిడ మాంసం తినదు అనవసరంగా దాని ప్రాణం తియ్యకండి. కోడి

గుడ్లయితే ఎన్నైనా వేయించు. మరేం అభ్యంతరంలేదు" అన్నాడు కృష్ణమోహన్. "నిజం? నువ్వు మాంసం తినవూ!" అంది తులసి దగ్గరకొస్తూ ఇందిరతో.

"నిజమే, మానేశాను." అంది ఇందిర. అప్పన్న ఏమీ పట్టించుకోకుండా పుంజుని దొరక బుచ్చుకుని, "మహా తిప్పలు పెట్టేశావుగదే. ఇప్పుడు నిన్నేం చేస్తానో తెలుసా?" అన్నాడు కసికొద్దీ. "ఆ తెలుసు, వదిలేస్తావ్. చాలా పాటు పడ్డావుగానీ ఆవిడ మాంసం తినదట. వదిలెయ్" అంది తులసి నవ్వుతూ. అప్పన్న తెల్లబోయాడు. పుంజు చేతుల్లోంచి జారి పరిగెత్తింది.

"నాకు కాస్త పనుంది వంటదగ్గర. ఇక్కడ కూర్చుం టావా; పైకి వెళతావా? నేనూ తొందరగా వచ్చేస్తాను." అంది తులసి ఇందిరతో. ఇందిర గదిలో కెళ్తుంటే తులసి వెనక్కి పిల్చి, కిటికీలో పోసివున్న కనకాంబరాలు తెచ్చిస్తూ,

"పొద్దుటే కోశాను. కట్టటానికి తీరికలేకపోయింది. పైకి వెళ్ళి మాల కడ్తూ కూర్చో, దారంకూడా వీటిలో వుంది." అంది.

ఇందిర పూలు చెంగులో పోసుకు పైకెళ్ళి మంచం కిటికీ దగ్గరకి లాక్కుని కూర్చుంది మాలకడుతూ. కాస్సేపటికి కృష్ణమోహన్ స్నానంచేసి కాఫీ తాగుతూ పైకివచ్చాడు. వస్తూనే అడిగాడు— "ఎలా వుంది యిల్లు? నచ్చిందా? కాబోయే కోడలికి ఇల్లు నచ్చకపోతే గొడవొస్తుంది."

ఇందిర కృష్ణమోహన్ మొహంలోకి చూసింది. తక్షణం— "ఏమిటిది? ఎవరైనా వింటే ఏమనుకుంటారు?" అంది మందలింపుగా.

"ఏమనుకుంటారూ? కాబోయే దంపతులు కబుర్లాడు కుంటున్నారనుకొంటారు" అన్నాడు - కిటికీ రెక్కలు మూసి మంచంమీద కూర్చుంటూ. ఇందిర లేచి కిటికీ తెరిచి కిటికీ కానుకు నుంచిని అంది— "నీ ధోరణి నాకేం బాగులేదు. ఎప్పుడో జరిగితే జరగొచ్చు. అస్తమానూ అదే పోదేమిటీ? నాలుగు రోజులుండి పోదామని వచ్చాను. గౌరవంగా ఉండనీ, అల్లరిపాలు చెయ్యకు నన్ను."

"ఛ, ఎందుకంత భయం ఇందూ? ఈ ఇల్లు నీది. నువ్వు అల్లరెందుకు పడతావు? ఏ క్షణానైనా నా కోరిక వెల్లడించడానికి సిద్ధంగా ఉన్నాను. ఎప్పుడో జరగబోయే వాస్తవాలని యిప్పుడే వూహించుకోవటంలో ఎంతానంద ముంటుందో తెలుసా? సరేలే, నే వెళ్తాను. మా స్నేహితు ల్నెవర్నీ కలుసుకోలేదు. తులసిని పంపిస్తాను." అంటూ కృష్ణమోహన్ మెట్లు దిగి వెళ్తూంటే తులసి హడావిడిగా యిద్దరాడవాళ్ళని వెంటేసుకు ఎదురుపడింది. అందులో ముత్తయిదువ హాస్యంగా అంది—ఎదురొచ్చేకృష్ణమోహన్‌తో "చూశావ్‌రా కృష్ణా! ఎంతైనా కాబోయే మొగుడివికదా? ఇది సిగ్గుపడటం, తొలగటం ఏమైనా వుందేమో చూడూ?"

"ఛ, పో అత్తా!" తులసి బుంగమూతి పెట్టినుంచుంది. కృష్ణ మోహన్ నవ్వాడు. "పాపం సిగ్గుపడుతూనేవుంది కదూ

పెద్దమ్మా! ఇక తొలగటం అంటావా? మనిమంత మనిషి నల్లపూసలా ఐపోతుంది చెప్పూ?— దానికేంగానీ యింత పొద్దుటే..."

"మీ బళ్ళో పిల్లెవరో నచ్చిందటగా, చూద్దామని..." అంటూ వాళ్ళంతా పైకి వెళ్ళారు. ఇందిర మాల చెరిసగం చేస్తూ కూర్చుంది.

"నిన్ను చూదామని వచ్చారు మా అత్త వాళ్ళు" అంది పైకి వెళ్తూనే తులసి. ఇందిర మర్యాదగా లేచి నుంచుంది — "నన్ను పిలిస్తే నేనే వచ్చేదాన్ని కదూ? కూర్చోండి" వాళ్ళిద్దరూ మంచంమీద కూర్చున్నారు, ఇందిరని నిశితంగా పరిశీలిస్తూ. తులసి వెళ్ళిపోయింది. వాళ్ళిద్దరూ ఇందిరని ప్రశ్నల్లో ముంచేశారు— "మీ నాన్నగారికేం పని? మీ అన్నదమ్ము లెంతమంది? చదువయ్యాక ఉద్యోగం చేస్తావా? పెళ్ళిచేసుకోనేదానికింత చదువెందుకూ! మీ కెంతాస్తి ఉంటుందీ? బస్తివాళ్ళకి పొలంగూళ్ళు పంపటానికి పట్టింపుండదనుకుంటా!" ఇలా ఇలా దాడిచేసిన ప్రశ్నలకి సాధ్యమైనంతవరకూ వినయంగా జవాబులు చెప్పింది ఇందిర. "అమ్మలక్కలంటారు. ఇలాంటివాళ్ళనే కాబోలు" అనుకుంది.

"ఐతే అమ్మాయ్! పల్లెటూళ్ళో ఏం చూస్తావూ?" అంది ఒకావిడ.

ఇందిర కాస్సేపు తటపటాయించి—"పంట—పొలాలూ—పళ్ళ తోటలూ అవీ..." నసిగింది. రెండో ఆవిడ ఫకాలున

నవ్వింది— "ఇన్నేళ్లుగా కాపురాలు చేస్తున్నాంగానీ ఒక్క సారీ పొలాలమీదికి వెళ్ళలేదు. ఏం వుంటుంది చూట్టానికీ... ఇక వెళ్దామే" అంటూ లేచింది. వాళ్ళతో ఇందిరకూడా క్రింది కొచ్చింది. వాళ్ళిద్దరూ అన్నపూర్ణమ్మతో ఏవో మాట్లాడి వెళ్ళిపోయారు. ఇందిర వంట పాకలోనే కూర్చుంది చాలా సేపు.

పది గంటలకి పిండివంటలతో భోజనం; మధ్యాహ్నం ఫలహారం పూర్తయ్యాయి.

"ఇవ్వాళ చేలమీది కెళ్దాం. తొందరగా తెమలండి" అన్నాడు కృష్ణమోహన్.

"జాగ్రత్తగా వెళ్ళండి. వానకురిసినగట్లు, బురదగా ఉండి జారిపోతాయి బోదెలవీ దాటేటప్పుడు. తులసీ! ఇందిర చెయ్యిపట్టుకు జాగ్రత్తగా తీసుకెళ్ళు. తొందరగా వచ్చె య్యండి. జాగ్రత్త సుమా! కాలుజారితే బెణుకుతుంది." అంటూ అన్నపూర్ణమ్మ పదే పదే హెచ్చరించింది

♦ ♦ ♦

వానకి నాని కాలేస్తే జారిపోతున్న గట్లమీద నడ వటం కష్టంగానే ఉంది ఇందిరకి. పాదాలమీద పడే కుచ్చెళ్ళు చేతుల్తో పట్టుకుని బొటనవేళ్ళు బురదలోకి గుచ్చి నెమ్మదిగా నడవసాగింది. తులసి నిర్భయంగా కుచ్చెలూపుకుంటూ జోరుగా నడిచిపోతోంది ముందు. కృష్ణమోహన్ ఇద్దరికీ వెనక మాటమాటకీ ఇందిరని హెచ్చరిస్తూ వస్తున్నాడు.

కనుచూపు మేరలో పచ్చటి పొలాలు అనుతున్నాయి- "ఆ బోదిదాటితే చేల మధ్య పడతాం" అన్నాడు కృష్ణ మోహన్. పదిబారలు నడిచేసరికి బోది రానేవచ్చింది. తులసి అవలీలగా దూకేసి అవతలి గట్టున నించుంది ఎదురుచూస్తూ. ఇందిర తటపటాయిస్తూ ఆగిపోయింది—"అవతలిగట్టు జారుడుగావుంది. దూకేసరికి కాలుజారిపోదూ?" అంది భయంగా. "నీతో బలే చిక్కే! బస్తీపిల్లకి పల్లె విహారాలెందుకో?... ఊ...చెయ్యి అందించు. నెమ్మదిగా రా" అన్నాడు కృష్ణ మోహన్ అవతలకి గట్టుమీదనుంచి చెయ్యిచాస్తూ. ఇందిర తటపటాయించింది. "అదేమిటే నించుని చూస్తావ్ చెయ్యి అందించూ" అంది తులసి. ఇందిరకి తప్పలేదు. చెయ్యి అందించింది. కృష్ణమోహన్ అందుకుని దాటిస్తూ "చేతగాక పోయినా సిగ్గుపడవే పిల్లకి...పట్టుకుని నడిపిస్తాను. పద" అన్నాడు చెయ్యివదలకుండా. తులసి నవ్వింది.

"అక్కర్లేదు విడు" అంటూ విడిపించుకుంది ఇందిర.

"సరే ఇంతకన్నా పెద్ద బోదులున్నాయి ముందు. అప్పుడు నేనసలు పట్టుకోను" అన్నాడు కృష్ణమోహన్— "నేపట్టుకుంటాను" అంది తులసి నవ్వుతూ.

సన్నటి గట్టుకి రెండు వైపులా గుండెలవరకూ తాకే పచ్చటి వరిచేలు! ఎంత లెక్కచూసినా సమతలంలో కన్నుల పండుగ చేసే పరచిన కంబళీ! పంటచేలని అంత దగ్గరగా చూడటం అదే తొలి తీవ్రత తగ్గిన పొడ మటి సూర్యకిరణాలు పచ్చటి వరి వెన్నులమీదా, కంకులమీదా పడి మిల మిలా

మెరుస్తున్నాయి. చల్లగాలికి చేనంతా మృదువుగా వూగుతూ అతిథుల్ని ఆహ్వానిస్తోంది. ఇందిర కుచ్చెళ్ళు వదిలేసి రెండు చేతులూ వరి కంకుల మీదనుంచి పోనిస్తూ నడవసాగింది.

"అరె! ఇందిరా! చేతులు తీసెయ్. వరి ఆకులు పొడిగా వుంటాయ్. చేతులు తెగుతాయ్!" అన్నాడు కృష్ణ మోహన్ ఆదుర్దాగా. ఇందిర నిర్లక్ష్యంగా నడుస్తూ బురదలో కుచ్చెళ్ళు అడ్డుపడి తూలింది— "అబ్బబ్బ! చెప్తే విన్పించు కోవు. మెయిన్ రోడ్లో నడిచినట్టు నడవకపోతే కాస్త ఆ చీర చేత్తో పట్టుకోరాదూ? తులసి చూడూ? ఎలా దూసుకు పోతుందో!"—నిజమే! తులసి పాదాలకంటని పొట్టి పరికిణీ చేత్తో పట్టుకో నవసరం లేదు. త్రాచులాంటి జడని ముందు కేసుకుని కుచ్చులు వూపుకుంటూ పోతూంటే గాజుల గల గలా, మువ్వల పట్టాల మృదువైన చప్పుడూ కలిసి మనో హరంగా పంటచేల మధ్య వనలక్ష్మి పరిగెడుతోందేమోననే భ్రమ పుడుతుంది. 'నాలాంటి బస్తీవాళ్ళకి ప్రకృతిలో చోటు లేదేమో! ఎంత కలిసినా ఎరువుగానే వుంటుంది' అనుకుంది ఇందిర.

ఈసారి పెద్ద బోదిమీద తాటిపట్టి కూడా ఉంది. తులసి దాటేసి వెళ్ళిపోయింది. ఇందిరకి దానిమీద నడు స్తూంటే కాళ్ళు గజగజా వణికాయి. భయంతో కృష్ణ మోహన్ బుజం గట్టిగా పట్టుకుంది— "వదులు, నన్నంటు కోకు," అన్నాడు హాస్యంగా కృష్ణమోహన్ పట్టి మధ్య కొచ్చాక వదిలించుకుంటూ. ఇందిర బెదుగ్గా వదలకుండా పట్టు

కుంది. "నీ అవసరమా ఇది?" అన్నాడు ఇందిర మొహంలోకి చూస్తూ. ఇందిర హఠానంగా యువతలి గట్టుకొచ్చి అంది విసుగ్గా, "ఇవన్నీ వుంటాయని తెలిస్తే రాకపోదును" — "తులసీ! అమ్మ దగ్గరుండి తీసికెళ్ళమని చెపితే నువ్వలా ముందు ముందు పోతావేం? ఇందిర రాదట" కృష్ణమోహన్ తులసిని కేకేశాడు.

"నువ్వున్నావుగా. నేను తాటితోపులో కూచ్చుంటాను వెళ్ళి" అంది దూరంగా తులసి.

"నా కాళ్ళు నొప్పెలెడుతున్నాయి. ఇంకెంతసేపు?" అంది ఇందిర.

"రెండు మైళ్ళు మాత్రమే నడువవలెను. నది బోదులు దాటవలెను" అన్నాడు కృష్ణమోహన్.

ఇందిర నవ్వి అంది—"ఫర్వాలేదు కానీ ఎకరం అంటే ఎంత వుంటుంది?"

"మనం నచ్చినదంతా తులసి పొలం. చూశావా! మొదటి బోది దగ్గర్నుంచీ ఆ కనపడే తాళ్ళవరకూ ఎనిమి దెకరాలు. ఎకరం అంటే సుమారుగా ఇటువంటి పెద్ద పెద్ద మడులు నాలుగౌతుంది."

"ఎకరాని కెన్ని బస్తాలు పండుతుంది?"

"పొలం బలాన్నిబట్టి. ఇప్పుడీ లెక్కన వెన్నుపెడితే ఎకరానికి రెండు పుట్లు— అంటే ఇరవై బస్తాలు యీజీగా రాల్తుంది ధాన్యం. తులసిపొలం ఎప్పుడూ బాగానే పండు తుంది—అదిగో తులసి! ఎలా కూర్చుందో తాళ్ళకింద."

ఇందిర వెళ్ళి తులసి ప్రక్కన కూర్చుంది— "ఇక్కడి చెరువేమిటి?" అంది పరిసరాలు చూస్తూ.

"ఇది ఆకుమళ్ళ చెరువు. అంటే వరి విత్తనాలకి ఈ నీరు సరఫరా అవుతుంది. చేలకి వేరే కాలవ నీరు వస్తుందనుకో" అన్నాడు కృష్ణమోహన్ బాగా వంగిన తాటిమీద కూర్చుంటూ.

చెరువుకి ఇందిరా వాళ్ళు కూర్చున్న గట్టు తూర్పు వైపుది. ఎత్తుగా పరిశుభ్రంగా వుంది. గట్టు పొడుగునా చెరువుచుట్టూ తాటిచెట్లు. అందుకే అది తాళ్ళతోపు! తాళ్ళ తోపులో ఆకుమళ్ళ చెరువు; చెరువునిండా పరచిన తామరాకులు! తాళ్ళ నీడలూ!

"మావయ్యా! మొన్న మొన్నటి వరకూ తాటికాయలు తెగ తినేశాం నేనూ అప్పన్నా. అమ్మ తిడుతూనే వుండేది. వాడు చాటుగా తేవటం; నేను దాలిగుంటలో కాల్చటం. ఒక్కోసారి అమ్మని బ్రతిమాలి రొట్టెలు కాల్పించేదాన్ని. టెంకలన్నీ దొడ్లో పాతర వేయించాను కూడా. అప్పన్న రోజూ బుర్రగుంజు కొడతా నంటాడు. నేనే విన్పించుకోవటం లేదు. రేపు కొట్టించుకుందామా?" అడిగింది తులసి మావయ్యని. కృష్ణమోహన్ ఇందిరను చూస్తూ అడిగాడు—"బుర్రగుంజు ఎప్పుడైనా తిన్నావా? ఇష్టమేనా?"

"ఏమో అదెలా వుంటుందో నే చూడలేదు" అంది ఇందిర చెర్లోకి చూస్తూ.

"పారపాటై పోయింది మామయ్యా! బట్టలు తెచ్చు కుంటే స్నానం చేసేవాళ్ళం" అంది తులసి, లేచి వెళ్ళి రేవులో తాటిపట్టీలమీద కూర్చుని కాళ్ళు నీళ్ళలోపెట్టి ఆడిస్తూ. నిశ్చలంగావున్న నీటిలో చిన్న చిన్న అలలు లేస్తున్నాయి. అలలమీద పడ్డ సూర్యకిరణాలు తులసిమొహం మీద ప్రతిఫలిస్తున్నాయి. పరిశుభ్రమైన నీటిలో తులసి మువ్వల పట్టాకాలు పద్మంలా కదలటం చూస్తూ కూర్చుంది ఇందిర.

"మొన్న నాగుల చవితికి కూడా ఇక్కడే స్నానం చేసి ఆ పుట్టలో పాలుపోశాం" అంది; తులసి లేచి వస్తూ. ఇందిర పుట్టకేసి చూచి హడలి పోయింది— "ఏమిటీ? ఇది పుట్టా? ఇందులో పాము లుంటాయా? ఎంత పెద్దదో!" అంది భయంగా ఆశ్చర్యంగా.

"ఎందు కంత భయం? మన కేం ఫర్వాలేదు లే కూర్చో — అన్నట్టు నువ్వెప్పుడైనా బట్టలతో చెర్లో స్నానం చేశావా?" అడిగాడు కృష్ణమోహన్.

"ఛ! అంత పబ్లిగ్గా స్నానం ఎలా?" అంది ఇందిర నుదురు చిట్లిస్తూ.

"భలేది మావయ్య ఇందిర! చెర్లో స్నానం బావుండ దట."

"అందుకే రేపు తోటలో చెరువులో చేయిద్దాం. ఇక్కడొద్దు. కొత్తవాళ్ళకి లోతుగా వుంటుంది ఈ చెరువు."

"నే చెయ్యను బాబూ! అంత బాహాటంగా స్నానం చెయ్యటం ఇష్టంలేకే పుష్కరానికి మా వాళ్ళంతా రమ్మంటే వెళ్ళలేదు" అంది ఇందిర.

"ఇదేం స్నానం కాదు. జల విహారం. రేపు చూద్దువు గానిలే."

"ఇక పోదాం మావయ్యా! పొద్దు పోతోంది" రాను రాను చీకటి అలముకుంది. అంత మనోహరమైన ఆ పరిస రాల విడిచి వెళ్ళాలనిపించలేదు ఇందిరకి.

"మరోసారి వద్దాం కదూ?" అన్నాడు కృష్ణమోహన్ లేస్తూ. తులసి ఇందిర చెయ్యిపుచ్చుకుని నెమ్మదిగా నడిచింది.

మర్నాటి సాయంత్రం తోట షికారుకు సన్నాహం.

"బట్టలు తెస్తున్నారా స్నానాన్కి?" అన్నాడు కృష్ణమోహన్.

"చెరు వెలా వుంటుందో ఇవ్వాళ చూసి రేపుచేద్దాం అంటున్నది ఇందిర. కానీ మామిడిచెట్లుకు వుయ్యాల వెయ్యటానికి పలుపులు తెస్తున్నాడు అప్పన్న" అంది తులసి.

"ఏం? ఇందిరా దేనికి వుయ్యాలమీదికి మనసు మళ్ళిందా?"

"నాకేం తెలీదు. తులసి చెప్తే నేనూ వూరుకున్నాను."

"సర్దాగా చెరువులో ఆడుకుందామంటే కేన్సిల్ చేసి పారేశావా? మీ బాద్‌రూం కంటే బాగానే ఉంటుంది తోటలో చెరువు."

"ఐనా ఈ వర్షాకాలం చెరువులో స్నానా లేమిటి? జలుబు చేస్తుంది. తోటలో కాస్సేపు కూర్చుని వచ్చెయ్యక" మందలించింది అన్నపూర్ణమ్మ.

"మావయ్యా! తోటలో తినటానికి మంచి టిఫిన్ తయారుచేశాను" అంది తులసి.

"మంచిదానివిలే. అవన్నీ అప్పన్న తెస్తాడు కానీ త్వరగా తెమలండి."

సాయంసమయం తోటలో తిరగటం బలే సర్దాగా ఉంది. విశాలమైన మామిడితోట! ప్రశాంతమైన వాతావరణం! దగ్గర దగ్గరగా పెరిగిన మామిడిచెట్లు! పైభాగాన ఒకదానొ్నకటి అందుకోబోతున్న పొడుగాటి కొమ్మలు! వర్షాలకు ముదురెక్కిన ఆకు గుబుర్లు! చెట్లకింద రాలి నాను తున్న పండుటాకులు! రెండు రోజుల్నుంచీ వాన లేక గట్టిపడిన కాలి దార్లు! కిందనుంచి నడుస్తూంటే తలకి తగిలే ఆకుల్ని చేత్తో తుంచుతూ ఉల్లాసంగా నడుస్తోంది ఇందిర. ఏ చెట్టు చూసినా భూమి మీదికి వంగిన కొమ్మలతో తల నిమురుతూ ఇక్కడే వుండమని అర్థిస్తున్నట్టే తోచింది ఇందిరకి— "ఈ కొమ్మ లెంత కింద కున్నాయో! వీటిమీద కాస్సేపు కూర్చుందాం" అంది ఇందిర కృష్ణమోహన్‌ని చూస్తూ—. "తోటంతా చూడాలి; ఉయ్యాల లూగాలి. చెరువుగట్టుమీద కూర్చుని ఫలహారం తినాలి. ఇవన్నీ ఎప్పుడూ యిక్కడ కూర్చుంటే?" అంది తులసి కలగజేసుకుని.

"తులసికి నచ్చకపోతే లాభంలేదు. వచ్చేటప్పుడు ప్పందాంలే ఇందిరా!" అన్నాడు కృష్ణమోహన్ ముందుకు నడుస్తూ. అప్పుడే వచ్చి తమలో కలుసుకున్న అప్పన్నకి పురమాయించింది తులసి—

"మాతో ఎందుకూ? చెరువుగట్టుమీది మామిడి చెట్టుకి ఉయ్యాళ్ళు వేసి ఆ పొట్లం చెట్టు మొదట్లో పెట్టి నువ్వాటు కొబ్బరి మడిలోంచి వెళ్ళిపో. ఇంటిదగ్గర పనుంటుంది."

అప్పన్న తాళ్ళు బుజంమీద వేసుకు వెళ్ళిపోయాడు.

ముగ్గురికి తోట షికార్లో చాలా చాలా కబుర్లు దొర్లి పోతున్నాయి.

"పళ్ళకాలంలో అంటే వేసవికాలం తోటని అమ్మేస్తాం. కొనుక్కున్నవాళ్ళే శ్రద్ధగా కాపలా కాయిస్తారు. మనకి కొన్ని వందల కాయలూ పళ్ళూ యిస్తారు. తర్వాత తోట మనకే అప్పచెపుతారు— ఈ తోట సరిగా వయసులో వుందన్నమాట మీ యిద్దరిలా. కాని కొన్నేసేళ్ళకి కొత్తమొక్కలు నాటుతూండాలి. ముదురు చెట్లుడిగిపోతే లేతచెట్లందుకుంటాయి." కృష్ణమోహన్ చెప్పుకుపోతూంటే— "గట్టుమీద ఉయ్యాల నాదీ — ఇందిరా! నీకూ నాకూ పోటీ!" అంటూ పరుగెత్తింది తులసి.

"ఇదేనా మీరు చెప్పిన చెరువు?" అంది ఇందిర. పరిసరాలు పరిశీలిస్తూ రెండో వుయ్యాల లందుకుంది.

కృష్ణమోహన్ చెరువుగట్టుమీద చెట్టుమొదట్లో నుంచున్నాడు రెండు వుయ్యాల్ళు చూస్తూ.

తులసి వుయ్యాల దాదాపు చెరువు మధ్యలోకి వెళ్ళి వస్తున్నది. కాళ్ళ వేళ్ళు ఎత్తయిన ఆకుల్ని అంటుకుంటు న్నాయి. అంత విసురుగా వూగటం ఇందిరకి చేతకాలేదు. నెమ్మదిగా వూగుతూ బాణంలా దూసుకుపోతున్న తులసి ఉయ్యాలని చూస్తు కూర్చుంది.

"పాపం ఇందిరకి చేతకావటంలేదు తులసీ! నే వూపుతాను నీతో సమానంగా" అంటూ కృష్ణమోహన్ ఇందిర వారిస్తున్నా విన్పించుకోకుండా బలంగా వూపసాగాడు. నాలుగైదు వూపుల వరకూ పుగ్గబట్టుకూర్చుని అంతె విసురుకి తమాయించుకోలేక వుక్కిరిబిక్కిరై పోయింది ఇందిర.

"బాబోయ్! చాలు! ఆపు! ఆపు" అంటూ భయంగా కెవ్వుమని అరిచింది.

ఉయ్యాల ఆగీ ఆగగానే తాళ్ళు వదిలేసి కింద కూర్చుండిపోయింది, కళ్లు మూసుకుని.

"ఏమైంది ఇందిరా! భయమేసిందా?" ఒంగుని అడిగాడు కృష్ణమోహన్.

"కళ్ళు చీకట్లుకమ్ముతున్నాయి. కడుపులో వికారంగా దడగా వుంది. ఆపమని గోలెడుతుంటే విన్పించుకోవు. అంత మోటు మనిషివేం?" విసుక్కుంది కళ్ళు చేతుల్తో మూసు కుంటూ.

"కొత్తవాళ్ళ కలాగే వుంటుంది మావయ్యా! రేవులోకి తీసుకెళ్ళి మంచినీళ్ళు పట్టించు" అంది జాలిగా చూస్తూ తులసి. కృష్ణమోహన్ ఇందిరని సముదాయించాడు—"నన్ను తర్వాత నీ యిష్టం వచ్చినట్టు తిడుదువుగాని కాస్త లేచి నడుస్తావా? మంచినీళ్ళు తాగితే వికారం పోతుంది."

ఇందిర రేవులో వేసిన కొయ్యమీద కూర్చుని మొహం కడుక్కుని మంచినీళ్ళు తాగింది.

"అబ్బా! ఎంత భయం వేసిందీ! పడిపోయాననుకున్నాను" అంది కోపంగా.

"అమ్మో! పడిపోనిస్తానా? పట్టుకుంటానుగాని— తులసి మాకూ! ఎంత ధైర్యంగా వూగుతూందో!"

ఇందిర దృష్టి మనోహరమైన చెరువుమీదకి పోయింది. పెద్దదీ చిన్నదీ కాని చెరువు! చెరువుచుట్టూ గోళాకారంలో లేత మామిడిచెట్లు! చెరువుమీదికి వంగిన కొమ్మలు! ప్రశాంతమైన నీటిలో ప్రతిబింబించే కొమ్మల నీడలు! వర్షాలు పడి జేగురు రంగు తేలిన నీరు! చెరువులో పల్చ పల్చగా తేలుతూన్న తామరాకులు! ప్రొద్దుటే విచ్చి వాడి పోయిన తామరపూవులు! అబ్బా! ఎంత ఆహ్లాదంగా వుంది! విశాలమైన తోటా; ప్రశాంతమైన చెరువు!

"ఏమిటి ఆలోచిస్తున్నావ్ ఇందూ?"

"ఈ తోటా ఈ చెరువూ ఎంతో బావున్నాయి. పట్నంలో ఎన్ని పార్కులైతే మాత్రం ఈ శోభనిస్తుంది?

"అవును. ఈ ప్రకృతి దృశ్యాలన్నీ చూడటానికి కళాదృష్టి వుండాలి. కాని ఇంకా! ఇంత మనోహరమైన ఈ చెరువులో మనం జంటగా విహరిస్తే మరీ బావుంటుంది కదూ?" కృష్ణమోహన్ ఇందిర కన్నులలోకి చూడబోతే ఇందిర చూపు తిప్పుకుని అంది—"ఛ, తులసి వింటుంది."

తులసి ఉయ్యాల వదిలేసి గజ్జెల గుర్రంలా పరుగెడుతూ వచ్చింది—"మీ నీడలు నీళ్ళలో బలే కన్పిస్తున్నాయి. మీ మధ్య నేనూ! జరగండీ— జరగండి" అంటూ చొరవగా యిద్దరి భుజాలమీద చేతులేసి ఇద్దర్నీ దూరంచేసి మధ్యలో కూర్చుని అంది. "చూడు మావయ్యా! నా నీడ కూడా పడింది—"

"అవునులే. నువ్వులేకపోతే చెరువు చిన్నబోదూ?" నవ్వాడు కృష్ణమోహన్.

"నువ్వు వెటకారంగా అన్నావేమోగానీ- నిజమంతే —ఆ ఇందిరా ఈ పొట్లం ఏమిటో చెప్పుకోగలవా?"

"చెప్పుకోకపోతే నీకు లేదు." అన్నాడు కృష్ణమోహన్.

"నాకు పెట్టకపోతే మీకు అరగదు లెండి—కాస్త ముట్టుకుని చెప్తాను." అంది ఇందిర నవ్వుతూ.

"ఓ వాసన కూడా చూడొచ్చు." అంది తులసి ఇందిర పొట్లం నలిపి నలిపి బాగా శల్యపరీక్ష చేసిందిగాని చెప్పుకోలేకపోయింది. "విప్పితే చూసి చెప్పుకుంటాను." అంది చివరికి చిలిపిగా.

తులసి పొట్లం విప్పింది. ఇందిర ఎంతాలోచించినా చెప్పలేకపోయింది.

"నువ్వే మావయ్యా!" అంది తులసి.

"ఓస్! నాకు తెలీనట్లు చెప్పకు. నే నేం బస్తీపిల్లని కాదు. ఇది బుర్రగుంజు."

"నిన్న చెప్పింది ఇదేనా? మర్చిపోయాను. ఎప్పుడూ చూడందే ఎలా తెలుస్తుందేం?" "రేపు మరో తాయిలం పట్టండి." అంటూ తులసి బుర్రగుంజు పంచింది.

"నీ తాయిలాలు తినలేక చస్తున్నాను వచ్చిన దగ్గర్నుంచి ఒకటే తిండి. ఈ లెక్కన తింటే పీపాలా అవుతాను. రేపు వెళ్ళిపోతాను బాబూ!" అంది బుర్రగుంజు తింటూ ఇందిర.

"ఆవు ఈనాలి, జున్ను తినాలి. జున్నుపాలు తాగాలి. అప్పుడూ వెళ్ళటం" అంది తులసి, చిన్నముక్క చెర్లోకి విసురుతూ. నిశ్చలంగా ఉన్న నీటిలో చిన చిన్న అలలు లేచాయి.

"ఛ. ఎందుకలా అల్లకల్లోలం చేస్తావ్!" మంద లించాడు కృష్ణమోహన్.

"చేపలు తినటానికి పైకొస్తాయి, చూస్తుండు." మరో ముక్క విసిరింది తులసి నీళ్ళలోకి.

"నీళ్ళు కదులుతూంటేనే బావుంటుంది. సూర్య కిరణాలు పడి మిలమిల్లాడుతాయి." అంది ఇందిర అలలను చూస్తూ.

"సరిపోయింది. ఇద్దరికీ నిశ్చలంగా ఉండడం యిష్టం లేకపోతే తన్నుకోండి." నవ్వాడు కృష్ణమోహన్.

"మే మిద్దరం ఎప్పుడూ జట్టే. ఇద్దరం కలిసి నిన్ను... తన్నుతాం." ఫక్కుమంది తులసి. ఇందిరకూడా చాలాసేపు నవ్వింది. తులసి అన్నట్లుగానే నీళ్ళలోంచి ఓ చిన్న చేప పైకొచ్చి బుడుంగున మునిగిపోయింది. తులసి సంతోషంగా చప్పట్లు చరిచింది. దగ్గరున్నదంతా నీళ్ళలోకి విసిరేసింది. ఇందిర తన దగ్గర మిగిలింది కూడా యిచ్చేసింది. కృష్ణమోహన్ యివ్వనన్నాడు.

"స్నానం చేస్తూంటే చేపలు కరవ్వూ" అంది ఇందిర అకస్మాత్తుగా గుర్తొచ్చి.

"మన్ని కరవ్వు. మనం తింటానికి పెట్టాం కదూ? మావయ్యని కరుస్తాయి."

"ఓ నా కేం భయంలేదు. వాటిని మచ్చిక చేసుకోటానికి నా కేం ఖర్మ?"

"నువ్వు రాకు. రేపు మే మిద్దరం వచ్చి స్నానం చేస్తాం." అంది ఇందిర కృష్ణమోహన్తో.

"ఏమ్మా? నే నేం పాపం చేసుకున్నానూ!"

తులసి కిలకిలా నవ్వింది. ఇందిర చిన్నగా నవ్వింది.

"ఇక పోదాం." తులసి లేచిపోయింది.

"ఈ ఉయ్యాళ్ళు ఇలాగే ఉంటాయా?"

"మాకేం ఫర్వాలేదు. ఆ పలుపుల్తో పని వచ్చేవరకూ ఇలాగే ఉండిపోతూంటాయి" ఇందిర కొయ్యమీదనుంచి నీళ్ళలోకి కాళ్ళు జాపి అల్లలాడించి లేచి నుంచుంది.

♦ ♦ ♦

మర్నాటి పొద్దుట ఇందిర నిద్రలేచి కిందకొచ్చేసరికి చావిట్లో అప్పన్న వట్లు దంచుతున్నాడు. ఇందిరని చూస్తూనే అన్నాడు అప్పన్న సంతోషంగా, "మన ఆవు ఈనిందమ్మాయి గారూ! దూడ చూడ ముచ్చటగా వుందండీ!"

"ఏం దూడ? ఆడదా; మొగదా?" అడిగింది ఇందిర మెట్లు దిగుతూ.

"ఆడపిల్ల! అచ్చు నీలా ఉంది. పేరు ఇందిర."దొడ్లోంచి చావిట్లో కొస్తూ అన్నాడు కృష్ణ.

"మధ్యలో నా పేరెందుకూ?"

"నువొచ్చాకే నీలాంటి ఆడపిల్ల పుట్టిందిగదూ! క్రిందటి రెండీతలకీ మొగపిల్లలే."

తులసి హడావిడిగా చావిట్లో కొచ్చింది—"పాకలో కెళ్ళి నేను చూసివచ్చాను ఇందిరా, దూడని. బలే ముద్దుగా ఉంది. సిన్నాన్న లేసికెళ్ళాను, దొడ్డిలోకెళ్ళి మొహం కడుక్కో గమ్మన్న—ఒకేయ్ అప్పన్నా! గంట నించీ ధంచుతున్నావ్ ఇవ్వాల్టి కౌతుందా నీ దంపు? ఏం మావయ్యా? అప్పుడే వచ్చేశావేం పాకలోంచి. అప్పన్న వచ్చేదాకా వుండలేక పోయావా? కాకులన్నీ పొడుస్తాయి దూడని." అంటూ

ఓసారి అందర్నీ అదమాయించేసి వెళ్ళిపోయింది. ఇందిర నవ్వుతూ దొడ్లోకెళ్ళింది.

ఇందిర మొహం కడుక్కున్నాక గొడ్లపాకలోకి తీసికెళ్ళింది తులసి.

ఆవు నుంచుని ముద్దలా పడుకునివున్న దూడ ఒళ్ళంతా నాకుతోంది. అప్పన్న ఘూడగొళ్ళు గిల్లి ఆవు నోటికందిస్తున్నాడు. అది చూస్తుంటే ఇందిరకి కడుపులో దేవింది. దూడమాత్రం బలే ముద్దుగా ఉంది. తెల్లటి తెలుపు! తోక మీద, నుదురుమీద నల్లటి మచ్చలు! అప్పుడే పుట్టిన దూడని తదేకంగా చూస్తూ నించుంది—"అదిగో! ఆ గేదె కూడా రేపో మాపో ఈనుతుంది. ఈ ఆవు బలే పాలిస్తుందిలే. ఇక పోదాం" అంటూ తీసుకొచ్చేసింది తులసి.

మధ్యాహ్నానికి జున్ను తయారైంది. ఇరుగు పొరుగులకి, మొహమాటస్తులకి జున్ను పెట్టడం ఐంది. మూడు గిన్నెలతో జున్ను తీసుకు పైకొచ్చింది తులసి.

"గంట క్రింద కడుపునిండా అన్నం తిని ఇప్పుడే ఇన్నేసి జున్ను తినాల్సిందే! అంత వద్దు. కాస్త నువ్వు తీసుకో తులసీ!" ప్రతిమాలింది ఇందిర.

"అదేం వీల్లేదు. నువ్వు నాజూగ్గా తింటే నేనేనా మోటుగా తినేది?" అంది తులసి.

"అసలు నీకు జున్ను రుచి తెలుసా ఇందిరా! తెలిస్తే ఇలా అంటావూ? ఘోసుపాలు తిను తిను." తను కానిస్తూ

అన్నాడు కృష్ణమోహన్. అంతా తినేసరికి జున్నంటే అసహ్యమనిపించింది ఇందిరకి.

"సాయంత్రం చెక్కో స్నానం! రెడీయేనా మీరిద్దరూ" అడిగాడు కృష్ణమోహన్.

"ఓ!" అంది ఉత్సాహంగా తులసి. ఇందిర మౌనం వహించింది.

"మౌనం అర్ధాంగీకారం. అవునా?" అ[illegible] కృష్ణమోహన్.

"అవును. అర్ధ అనంగీకారం కూడా." నవ్వి[illegible]

"అదేం వీల్లేదు. ఇవ్వాళ సాయంత్రం చె[illegible] చెయ్యాల్సిందే. మళ్ళీ చెప్పేది లేదు. నేనలా ప[illegible] కేసి వెళ్ళొస్తాను." -వెళ్ళిపోయాడు కృష్ణమోహన్

సాయంత్రం నూనెయ్యి ఇంటికి రాగానే కొత్త సమాచారం అందజేసింది తులసి. "ఇవ్వాళ కూడా నీ ప్రోగ్రాం రద్దయిపోయింది. మేం పేరంటానికి వెడుతున్నాం. అత్తయ్యగారి సుబ్బులు అనుకోకుండా పేరంటం పెట్టింది." అంది పట్టు పరికిణిలో బుట్టబొమ్మలా తిరుగుతూ. కృష్ణమోహన్ వుసూరుమన్నాడు. "పేరంటక్కల్లా తయారవటం చూడగానే గుండెల్లో రాయిపడిపోయింది. ఛీ, ఛీ, ఈ ఆడవాళ్ళతో ఏదో అష్టు అనుకున్నది చస్తే జరగదు-ఇందిరా చేవికి పేరంటాలమీ దెత్తిందేం?"

"బావుందిలే వరస! నేనేం చేశాను మధ్య!" అంది ఇందిర జరీపైటంచు వేళ్ళతో రాస్తూ.

"రేపు తప్పకుండా వెళ్ళాంకదూ మావయ్యా చెరువుకి. పేరంటానికి వెళ్ళకపోతే అత్తయ్యకి కోపం వస్తుంది. ఆ కోపం కంటే నీ కోపమే నయం." అంది తులసి మావయ్యని సముదాయిస్తున్నట్లు.

కృష్ణమోహన్ కోపంగా బయట కెళ్ళిపోయాడు.

"ఊరికే ఎలా వెళ్తావ్? మొన్న మావయ్య తెచ్చిన గుడ్డల్లో ఒకటి పట్టుకెళ్ళు" అంది అన్నపూర్ణమ్మ. గదిలో కెళ్ళి వో గుడ్డ తీసుకొచ్చి పసుపుబొట్లు పెట్టి ట్టుకుంది. బస్తీలో పేరంటాని కెళ్ళటానికి బద్ధకించే టూరి పేరంటా లెలా వుంటాయో చూడాలని ంది. మెయిన్ రోడ్లోనైనా చకచకా నడిచే టూరి సందుల్లో నడవడానికే తడబడింది. రష్‌గా చోట్ల ఎవళ్ళెలాపోయినా ఎవరిక్కావాలి? కానీ ఖాళీ సందులో బస్తీపిల్ల నడుస్తూంటే అంతా విరగబడి చూస్తారు.

పేరంటానికి ముత్తయిదువలు, పడుచువాళ్ళూ పిల్లలూ చాలామంది వచ్చారు. మండువా అంతా కిటకిటలాడిపోతు న్నది. అంతా పట్టుచీరలూ జరిచీరలే కట్టుకున్నారు. జడల్లో మాపెట్టేసి పూలగుత్తులు! తులసి వెళ్తూనే అందర్నీ ఓసారి కలేసింది. ఇందిరని అందరికీ పరిచయం చేసింది. అంతమంది ఆడవాళ్ళు ఒక్కసారి తనని చూడటంతో ఇందిర సిగ్గుతో ముడుచుకుపోయింది. పక్కగదిలోకి తీసికెళ్ళిందో కావిడ. గదిలో పచ్చితాటాకులమీద తెల్ల జరీచీర కట్టుకు కూర్చుంది సుబ్బులు తలవంచుకుని. దూరంగా వెండి పళ్ళెంలో చాలా

రవిక గుడ్డలున్నాయి. చాలామంది పేరంటాళ్ళు ఆ పిల్లని వేళాకోళాలు చేస్తున్నారు. "ఏవమ్మోయ్! కూతురు పెద్ద దయిందని సంబరపడితే కాదు. అల్లుణ్ణి తేవాలి." అందొకావిడ సుబ్బులు తల్లి నుద్దేశించి.

"కక్కొచ్చినా కళ్యాణ మొచ్చినా ఆగదమ్మోయ్ వదినా! తేనక్కర్లేకుండానే వస్తాడు అల్లుడు." అందావిడ జవాబుగా. వింటూ నుంచున్న ఇందిరని "పసుపు పూయించుకుందాం రా." అని దొడ్లోకి తీసికెళ్ళింది తులసి. ఓ అమ్మాయి ఇందిరకీ తులసికీ కాళ్ళు కడిగి తడిమీద పసుపు పూసింది. తర్వాత తిలకం బొట్టుమీదే కుంకుం బొట్టు పెట్టింది. చాలసేపు కూర్చున్నారు చావిట్లో అంతా. తర్వాత బెల్లం కలిపి నానబియ్యం, నువ్వు చిమ్మిరీ, అరటిపళ్ళూ తామరాకుల్లో పెట్టియిచ్చారు. ఇంటికొచ్చేసరికి పొద్దుపోయింది.

విశేషాలన్నీ అన్నపూర్ణమ్మకి చెప్పింది తులసి. ఆమె పట్టు పరికిణీ విప్పేసి సాదాబట్టలు కట్టుకుని అంది—"నీచీర కూడా విప్పేదువుగాని పద" ఇద్దరూ పైకి వెళ్ళారు. కృష్ణమోహన్ పిట్టగోడ కానుకు నించుని చింతకేసి చూస్తున్నాడు, తులసీ ఇందిరా రావటం గమనించనట్లు.

"ఏమిటో అంత దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్!" అంది ఇందిర పక్కన నుంచుని.

"ఏదో పోటి, నాతో మాట్లాడకండి."

తులసి నవ్వింది. "నో, మావయ్యకి కోపం వచ్చింది ఇందిరా" అంది.

"అయితే మనమే మాట్లాడుకుందాం. చూడు తులసి! పాదాలమీద పసుపు కుచ్చెళ్ళ జరీకంటింది. పోనీలే మీ పూళ్ళో జరిగిన పేరంటానికి ఆనవాలుగా వుంటుంది కదూ?" కృష్ణమోహన్ చలించలేదు.

"ఐతే ఇందిరా! పాపం రాయి తగిలి బొటనవేలు నెత్తురు కారింది కదా ఇప్పు డెలావుంది." అంది తులసి కళ్ళతో సైగజేస్తూ "అబ్బా! చాలా బాధగావుంది తులసీ! అసలు నిలబళ్ళేకపోతున్నాను." అంది బాధగా ఇందిర పిట్టగోడకి జేరబడి.

"అంత కళ్ళు నెత్తిమీద పెట్టుకు నడవడం దేనికీ. బాగా నెప్పిగా వుందా?" అన్నాడు కృష్ణమోహన్ ఆదుర్దాగా. తులసి ఫక్కుమంది_ "అంతా వుత్తదోయ్" అంటూ. . .

ఓడిపోయావు నువ్వు." నవ్వింది ఇందిర. కృష్ణమోహన్ తెల్లబోయినా తమాయించుకుంటూ "నీ దగ్గరెప్పుడూ వోడిపోతాను ఇందిరా!" అన్నాడు.

♦ ♦ ♦

కొయ్యమీదే కూర్చుని చెరువులోకి దిగనని మొండికేసింది ఇందిర.

"లోతువుండదు. అడుగునంతా యిసుక. మేము చాలాసార్లు స్నానం చేస్తుంటాం ఇందిరా! ఏమీ భయం ఉండదు" అని చెప్పింది తులసి. ఇందిర చాలాసేపు ఆలోచించింది.

"మరి బట్టలెక్కడ మార్చుకోటం ?" సందేహం వెలిబుచ్చింది ఇందిర.

"ఇన్ని చెట్లున్నాయి. దేని చాటునైనా మార్చుకోవచ్చు."

"పోనీ నేను తోమిమ్మిదిమైళ్ళు వెళ్ళిపోయి కూర్చుంటాను. మీరు పిలిచేదాకా రాను. సరా ?" అన్నాడు కృష్ణమోహన్. ఇందిర నవ్వేందిగానీ అప్పటికీ ఒప్పుకోలేదు. "మీరు దిగండి చూస్తాను." అంది.

"ఇదేం కుదరదు తులసి ! నువ్వా రెక్కట్టుకో." అంటూ కృష్ణమోహన్ బలవంతానికి పూనుకొనేసరికి ఇందిర బతిమాలుకొంది_ "వద్దొద్దు. నే దిగుతున్నాను."

తులసి చొరవగా కొయ్యమీదనుంచి నీళ్ళలోకి దిగి అలా అలా లోతుకెళ్ళింది. ఇందిర భయం భయంగా ముందు కాళ్ళు జార్చి నెమ్మదిగా దిగి నుంచుంది.

"ఏమిటా భయం ! నీ ప్రాణమేనా అంత తీపి ?" అంటూ నాలుగడుగులు ముందుకు లాక్కెళ్ళాడు కృష్ణమోహన్. నీరు నెమ్మదిగా చల్లగా తాకుతూ పైకెక్కుతోంది. నీళ్ళమీద చీర గొడుగులా లేచింది. "బట్టలు బలవంతాన నీళ్ళలో ముంచెయ్యాలి." అంది నీళ్ళలో తెగ తిరుగుతూ. ఇందిర చీరని చేతుల్తో అదిమిపట్టి మరికొంత దూరం వెళ్ళేసరికి నీరు గుండెలదాకా పాకి పైట లేచి నీళ్ళమీద తేలియాడసాగింది. కంఠంవరకూ తిడుపుకుని కాస్త వెనక్కెళ్ళి

నుంచుంది ఇందిర. చలికి ఒళ్ళంతా గగుర్పొడిచింది. వణుకుతూ నించుంది ఇందిర.

"చూడు తులసీ! ఇందిర నిలుచుండిపోయింది మలిచిన శిల్పంలా." అన్నాడు కృష్ణమోహన్. తడిబట్టలు ఒంటి నంటిపోవటం చూసి ఇందిర సిగ్గుతో చితికిపోయింది.

"తడిశాక గాలిలో నుంచుంటే చలేస్తుంది ఇందిరా! కంఠంవరకూ నీళ్ళలో మునిగిపో, ఇలా రా! అదిగో ఆ తామరకాడ అందుకోగలవా?" అంటూ తులసి ఇంకాస్త దూరం వెళ్ళి తామరకాడలు తెంచి గొలుసులు చెయ్య సాగింది. ఇందిర నిర్భయంగా నీళ్ళలో దిగింది చొరవచేసి.

"నువ్వు కాస్త దూరంగా వెళ్ళు కృష్ణమోహన్." అంది ఇందిర నీళ్ళని చేతుల్తో సర్దాగా పోగుచేస్తూ.

"నే వెళ్ళను. ఇది నా చెరువు. నన్ను దూరంగా పొమ్మనటానికి నువ్వెవరవి?" అన్నాడు హాస్యంగా కృష్ణమోహన్ ఇద్దరిమీద నీళ్ళు జల్లుతూ.

"ఏయ్! తల తడుస్తుంది. ఇలా ఐతే నే నుండను" అంది తులసి చిరుకోపంగా.

"ఉండకపోతే వెళ్ళు. నేనూ ఇందిరా ఆడుకుంటాం ఎంచక్కా!"

"నే నసలే వుండను. రా తులసీ పోదాం! చాలు గానీ" అంది ఇందిర తులసికి కళ్ళతో సైగచేస్తూ. ఇద్దరూ కోపం నటిస్తూ రేవుకేసి మళ్ళారు. ఇద్దర్నీ కొయ్యదాకా వెళ్ళనిచ్చి చెరోరెక్కా పట్టుకు బరబరా ఈడ్చుకెళ్ళాడు

కృష్ణమోహన్ లోపలికి. తులసి కిలకిలా నవ్వేసింది. ఇందిర బుంగమూతి పెట్టింది నీళ్ళను చేతుల్తో చెల్లాచెదురుచేస్తూ.

"తులసీ! మీకూ నాకూ పందెం. మీరు కొయ్య దగరికి కెళ్ళేవరకూ ఇక్కణ్ణుంచి కదలను. కొయ్య ఎక్కుతోంటే గమ్మునొచ్చి వెనక్కి లాక్కొస్తాను. నే వొచ్చే లోపునే మీ రెక్కిపోతే నే నోడిపోయినట్టు. మీ రెక్కలేక పోతే మళ్ళీ కాసేపు నీళ్ళలో తిరిగివెళ్ళాలి ఒప్పుకుంటారా?" అన్నాడు కృష్ణమోహన్ ఇద్దర్నీచూస్తూ.

"నేను ఒప్పుకుంటాను. నువ్వో?" అంది తులసి.

"సరే." అంది ఇందిర.

కృష్ణమోహన్ దూరంగా వెళ్ళి నించున్నాడు. ఇద్దరూ కొయ్యదగ్గరి కొచ్చేశారు.

"వచ్చేస్తున్నాను." అంటూ అంతదూరం నుండి వచ్చేస్తున్నాడు కృష్ణమోహన్. జారుడుకొయ్య తొందరగా ఎక్కబోతుంటే జారిపోతుండేది. పైగా కంగారు. ఇంతలోకీ కృష్ణమోహన్ రావటం ఇద్దర్నీ వెనక్కు లాక్కుపోవటం. తులసి విరగబడి నవ్వుతోంది ఆటకి. ఇద్దరు నాలుగైదుసార్లు వోడిపోయారు. వోపట్టులో తులసి ఎక్కేసిందికొయ్య. ఇందిర వోడిపోయి వెనక్కిపోయింది. కృష్ణమోహన్ ఇందిరని దాదాపు మధ్యకి తీసికెళ్ళిపోయాడు గట్టిగా పట్టుకుని—

"ఇక నేనాడలేను. అలుపుగావుంది. వెళ్ళిపోదాం." అంది ఇందిర జాలిగా. అతను ఇందిరని తీసికొచ్చేశాడు. తులసి చెయ్యిపట్టుకుంది. ఇందిర గట్టుమీద కొచ్చింది.

కృష్ణమోహన్ తుండు, బట్టలు తీసుకుని దూరంగాపోయాడు. తులసి, ఇందిర చెరువుగట్టుమీద బట్టలు మార్చుకున్నారు. తడిబట్టల నీళ్ళు పిండేసి, సంచిలోకుక్కి చెట్టుమొదట్లో పెట్టింది తులసి— ఆనక అప్పన్న తెస్తాళ్ళే అంటూ.

"ఆకలి, ఆకలి. ఏదీ నువ్వు తెచ్చినతాయిలం తొందరగా పెట్టు." అంటూ పొడిబట్టలు కట్టుకుని తుండు చెట్టు మొదటికి విసిరేసి హడావిడిగావచ్చి ఇద్దరి మధ్యా కూర్చున్నాడు కృష్ణమోహన్.

"అంత కంగారైతే ఎలా? కాసిని తామరాకులు కొయ్యిముందు ఈతాయిలం ఏమిటో ఇందిర చెప్పుకోవాలి." అంది తులసి టిఫిన్ కారియరు ఊడదీస్తూ.

"ఇందాక చెప్తే కోసేవాణ్ణికదా." అంటూ గట్టు మీదనుండి వంగి నాలుగైదు తామరాకులు కోసి తెచ్చాడు కృష్ణమోహన్. ఇందిర కాస్సేపాలోచించి "పరమాన్నం" అంది టిఫిన్ చూసి.

"తప్పావులే. నువ్వు మావయ్యా." అతనికికూడా అంతుపట్టలేదా తాయిలం.

"ఇదేదో పరమాన్నంలావుంది. ఏమిటి చెప్మా? ఆ, అటుకులు పాలలో......"

"అటుకులా? చాలాసార్లు చూశానుగానీ తెలుసుకో లేక పోయానే." అంది ఇందిర తింటూ. "పంచదార చాల్లేదు తులసీ!" అన్నాడు కృష్ణమోహన్.

"ఛ, ఎక్కువైంది" అంది ఇందిర.

"కాదు. సరిపోయింది." అంది తులసి. కడుపులు నిండుతున్న కొద్దీ కబుర్లు వూరుతున్నాయి.

"నువ్వు ఏతాం-మోటబావి-దిగుడుబావి చూశావా!" అంది వున్నట్టుండి తులసి.

"పేర్లు విన్నట్లు గుర్తు.ఎక్కడో, నేనెప్పుడు చూశానో?" అంది ఇందిర.

"అయితే మావయ్యా! రేపు రాఘవులతోటకి వెళ్దాం ఇందిర చూస్తుంది." అంది తులసి

"అవి పనిచేసే టైంలో చూస్తే బావుంటుంది. ఇప్పు డెందుకూ? వద్దు" అన్నాడు కృష్ణమోహన్.

"అదేమిటి? అన్నీ చూపిస్తానని తీసుకొచ్చి." అంది ఇందిర ఆశగా.

"ఐతే చూస్తావా? సరే వెళ్దాంలే"

"లే, అంటేకాదు. వెళ్దాం అవెలావుంటాయో యోచి స్తాను. తులసీ! చేతులు కడుక్కుందాం వస్తావా?" ఇద్దరూ వెళ్ళి కొయ్యమీద నుంచుని చేతులు కడుక్కున్నారు. టిఫిన్‌తో నీళ్ళుతెస్తే కృష్ణమోహన్ కూడా కడుక్కున్నాడు.

"ఇక వెళ్దాం. కిందికి వంగిన కొమ్మలమీద కాస్సేపు కూచ్చుందాం" అంది ఇందిర.

"నిన్న వుయ్యాల సరిగా వూగేలేదు. కాస్సేపు వూగి వెళదాం." అంది తులసి వుయ్యాలకేసి వెళ్తూ. ఇందిరకూడా రెండో వుయ్యాల అందుకుంది.

మొన్నటికంటే నయంగా వుంది. చెరువుగట్టున ఎత్తయిన కొమ్మలకి వేసిన తాళ్ళవుయ్యాల్లు పోటీగా వూగడం ఎంత సరదాగా వుంటుంది! తోటంతా చెట్లన్నీ చెరువుకూడా దూరంగా వెళ్ళివస్తున్నట్లనిపించింది. కాసే పటికి ఇందిర వూగలేనని దిగిపోతే కృష్ణమోహన్ వూగాడు ఉయ్యాలెక్కి.

"ఇదివరకు నేను ఉయ్యాల ఊగడానికి వెళ్తుంటే మావయ్య నన్ను తిట్టేవాడు. ఇప్పుడు మనతో చేరి ఆడపిల్ల లాటలాడుతున్నాడు." అంది తులసి ఇందిర దగ్గరికొస్తూ. తరువాత చాలాసేపు తోటపషికారు!

మర్నాడెక్కడికీ కెళ్ళడానికీ వీల్లేకపోయింది. సన్నగా వాన లంకించుకుంది పొద్దుటినుంచి.

"పంచాయితిలో కేరెమ్సు బోర్డుఉంటుంది. తెప్పించనా? ఆడుకుందాం" అన్నాడు కృష్ణమోహన్.

"వద్దు. మేం పచ్చీసు ఆడుకుంటాము." అంది తులసి.

"ఐతే నాకేం ఊసుపోతుందీ? ఎక్కడికన్నా పోదామంటే ఈ చినుకు లొకటి. ఏం ఇందిరా! కేరెమ్సు నీకెంతో ఇష్టం కదూ? తులసికూడా నేర్చుకుంటుంది."

"పచ్చీసెలావుంటుందో నేర్చుకొంటాను. కేరెమ్సు తెలిసిందేగా! పల్లెటూరి పద్ధతులు నేర్చుకోమన్నావుకదూ?" నవ్వింది ఇందిర నిగూఢంగా.

"సరసుని తీసుకొస్తాను. అదివుంటే ఆట బావుంటుంది. అంటూ పరిగెత్తింది తులసి.

"ఈ వర్షంలో ఎలావస్తుందా అమ్మాయి ?" అంది ఇందిర.

"వాళ్ళిల్లు దగ్గరేలే. ఐతేమాత్రం రాకపోతే పూరుకుంటుందేం ఇది ? నేపోతాను. వాళ్ళంతా వస్తే ఇక్కడ చిక్కడిపోవాలి." లేచాడు.

"అప్పుడే ఐదురోజులైంది, అమ్మా వాళ్ళు ఏమను కుంటున్నారో ఇంటిదగ్గర."

"ఆ, వెళ్ళవచ్చులెద్దూ నిన్ను క్షేమంగా అప్పజెప్పే బాధ్యత నాది. పోనీ రేపోకార్డురాయి. అత్తవారింటో క్షేమంగావున్నాను అని." ఇందిర నవ్వింది. కృష్ణమోహన్ నవ్వుతూ వెళ్ళి పోయాడు. మరుక్షణంలో తులసి ఇద్దరమ్మా యిల్ని వెంటేసుకుని పచ్చీసు బల్ల, గవ్వలడబ్బా తీసు కొచ్చింది.

"ఈ అమ్మాయి సరస్వతీ; ఆ అమ్మాయి రాధ, నలుగురిమీదా ఆట బావుంటుంది." అంటూ నాలుగురకాల పావులు వేరువేరుగా పెట్టి గవ్వలు చేతులోకి తీసుకుంది తులసి.

"అసలీ ఆటకి పద్ధతులేమిటో సింపుల్‌గా చెప్పలేక పోతే ఎలాగాడ్డం ?" అంది ఇందిర.

"చూస్తుండు. అదే తెలుస్తుంది. మొత్తం ఐదుపం దాలు, అంతా పావులెక్కించుకునే దాకా వొకర్నొకరు చంపుకోడానికి వీల్లేదు. చంపుడుపందెం వొారికెతేకానీ పంట కెళ్ళకూడదు."

“అబ్బో! బోలెడు నియమాలు. అసలు ఆట ఆడనీ అదే బోధపడుతుంది.” అంటూ తులసి గవ్వలు గులకరించి పోసింది. “పచ్చీసూ” అంది వుషారుగా.

చేతులో గవ్వలు కదిపి కిందపోస్తే అవి ఇష్టంవచ్చినట్లు పడడం—

‘దాన్నిబట్టీ పందాలు, పచ్చీసులూ, తీసులూ, దాన్‌లూ బలే సరదాగా వుందే.’ అనుకుంది ఇందిర. ఆటలో వాళ్ళు చంపుకోటం! తిరిగీ ఎక్కించుకోడం! చంపినవాళ్ళకి సంతోషం! చచ్చినవాళ్ళకి కోపం! రాధ వుత్త వుడుకుమోతు పిల్ల. పావు చచ్చినప్పుడల్లా బిక్కమొహం పెట్టేసేది. తిరిగి పందెం చచ్చినదాన్ని బ్రతికించుకునే వరకూ వట్టేసేది. ఒకటే ఆరాటం! మొదటి ఆటలో సరస్వతి ముందు పండింది. ఇందిర వోడిపోయింది, తరువాత రెండాటల్లో ఇందిరే వోడిపోయేసరికి బాధనిపించింది. నేర్పుగా, పట్టుదలగా ఆడి ముందు పండింది నాలుగో ఆటలో, మొత్తానికి పచ్చీసు పట్టుపడింది. పైగా సరస్వతితోనూ, రాధతోనూ స్నేహం కలిసింది.

“మాయింటి కొకసారి రండి!” అంది సరస్వతి ఆప్యాయంగా ఇందిరతో.

“అలాగే మరి చినుకులు పడుతున్నాయికదా?” తప్పుకోబోయింది ఇందిర.

“మరేం ఫరవాలేదు. మేం రాలేదేమిటి?
పద వెళ్దాం వాళ్ళిళ్ళు చూద్దువుగాని” అంటూ ఆట ఎత్తేసిందితులసి. మధ్యలో ఆటెత్తేసినందుకు కోపంవచ్చింది రాధకి.

"ఏమిలేకంగాను? నీతో ఏదైనా ఇంతే. అయ్యేదాకా ఆరాటం— అయ్యేక......"

అంటూ విసుక్కుంది. తరువాత నలుగురూ ఆ చినుకుల్లోనే దొడ్డిదారిన సరసూవాళ్ళింటి కెళ్ళారు.

"బస్తీవాళ్ళు మా పల్లెటూరి వంటలు తింటారా? అంటూ నెల్లాళ్ళ క్రిందట నండి భోషాణంలో భద్రపరచిన అరిసె పెట్టింది సరస్వతి. పెట్టింది పూరుకోక తినేవరకూ బలవంత పెట్టింది. ఇందిర ఓ అరిసె తినటానికి ఆపసోపాలు పడింది. తర్వాత వాళ్ళిల్లూ దొడ్డీ చూపించింది సరస్వతి. "మా ఇంటికి రండి తులసీ! ఇక్కడేకదూ?" అడిగింది రాధ.

"రేపొస్తామండీ తప్పకుండా. ఇప్పుడు నాకు తలనొప్పి గావుంది." అంటూ తప్పుకోబోయింది ఇందిర ఆవిడేం బూరెలు పెడుందోనని భయమేసి. ఇందిర ఎత్తేం సాగలేదు. రాధ మరీమరీ అడిగేసరికి తులసి ఆ చినుకుల్లోనే రాధా వాళ్ళింటితోపాటు నాలుగైదిళ్ళు త్రిప్పి సాయంత్రాని కింటికి తీసుకొచ్చింది. "నీ తిరుగుడు ఆ అమ్మాయికూడా నేర్పేసేలా వున్నావు తులసీ!" అంటూ హాస్యంగా మందలించింది అన్నపూర్ణమ్మ ఇంటికి రాగానే.

" నా ఐడియా అంతా తల్లక్రిందులై పోయిందమ్మా! ఇందిరని చూసి తులసి కుదురు నేర్చుకుంటుందనుకున్నాను. తులసిని చూసి ఇందిరే అల్లరి నేర్చుకుంటుం దేవిటి?" ఆశ్చర్యం వెలిబుచ్చాడు కృష్ణమోహన్.

"కాబట్టి ఇందిరని చూసి నువ్వుకూడా అల్లరి నేర్చుకో" అంది తులసి నవ్వుతూ.

"ఈపూట జున్నుపాలు విరిగిపోయాయి తులసీ! దాలిమీద పెట్టాను. కాగాయేమో చూసి తొగండి." అంది అన్నపూర్ణమ్మ. తులసి ఒక్క పరుగున వెళ్ళి మూడుగ్లాసుల్తో పాలు తీసుకొచ్చింది.

"మావయ్యకేమో తీపి ఎక్కువుండాలి. ఇందిరకి తక్కువ!" అంది పంచదార కలుపుతూ. ఇందిరకి ఈ తాగటాలూ — తినటాలూ ఘోరమైన సమస్యైపోయింది తను తినకపోతే కృష్ణమోహన్ తిననంటాడు కృష్ణమోహన్ తినకపోతే తులసి తిననంటుంది. అంతా మానేస్తే వాళ్ళమ్మ గారు ముట్టుకోరు. ఈ పెరుగులూ, పాలూ— పిండివంటలూ— నాలుగేసి కూరలూ తినేసరికి ఇందిర తలప్రాణం తోకకొచ్చేది. కాదన లేక జున్నుపాల గ్లాసందుకుంది.

♦ ♦ ♦

"రాఘవుల తోటకి తీసికెళతాను. ఆ తర్వాత కొబ్బరి తోటలోంచి మన తోటకొచ్చి కాస్సేపు చెరువులో ఆడుకుందాం—లేకపోతే తీసికెళ్ళను" అన్నాడు కృష్ణమోహన్.

"బావుంది షరతు" అంది మూతి ముడుచుకుని ఇందిర.

"బావుండకపోతే మానెయ్. మొాబబావి లేదు ఏమీ లేదు."

"తీరా అవి చూశాక చెర్లో దిగమంటే?" ప్రశ్నార్థకంగా చూసింది ఇందిర.

"అబ్బో! గడుసుదానివే! ఎత్తుకు తీసికెళతాను చెర్లోకి — ఇంతకీ నా బలవంత మేమీ లేదు సుమా! చక్కగా రాఘవులతోటా — మోటా బావీ చూడాలంటే నీ యిష్టం."

"సరే" అంది ఇందిర_ ఆ సాయంత్రం ముగ్గురూ మోటబావి చూట్టాని కెళ్ళారు. అదికూడా మామితోటే. తోటకు మధ్య అగాధంలాంటి బావి! బావికి చుట్టూ ఏమీ లేదు. ఒకవైపున కొయ్యలు పాతివున్నాయి. వాటికిముందు నాలుగైదు గజాలవరకూ చోటు నలిగి వుంది.

"తోలుతో కుట్టిన పెద్ద పెద్ద బానలుంటాయి. బానని లావుపాటి తాడుకు కడతారు. ఈ కాస్త మేరలో ఎడ్లు వెనక్కీ ముందుకీ నడుస్తూంటాయి. వెనక్కి నడిచి బావి దగ్గరికి రాగానే బాన నీళ్ళలో మునుగుతుంది, ఎడ్లు ముందు నడుస్తూంటే పైకొచ్చి ఆటోమేటిగ్గా నీరు బోదిలోపడుతుంది. బోదివెంట చెట్లకి పోతుంది దీన్ని మోటతోలటం అంటారన్నమాట. తెలిసిందా?" విశదీకరించాడు కృష్ణమోహన్ బావిని చూపిస్తూ. దగ్గరకెళ్ళి చూడటానికి భయమేసింది ఇందిరకు— "వెళ్ళొద్దు. కళ్ళు తిరుగుతాయి" అన్నాడు కృష్ణమోహన్.

"మావయ్యా! మన వూరికి కరెంటు వస్తే నీళ్ళు తోడటానికి మిషన్ పెట్టిస్తాడట రాఘవులు" అంది తులసి.
"ఆ ఇప్పట్లో ఎక్కడా మనకి కరంటూ!" అన్నాడు.

"మరీ ఏతాం ఎలా వుంటుందీ?" అంది ఇందిర.

"వెడదాం. అది ఇలా నుయ్యిలా వుండదు. కాస్త వెడల్పుగా చిన్న కుంటలా వుంటుంది. చూస్తే తెలుస్తుంది పదండి."

నాలుగైదు మళ్ళు దాటించి ఏతాం దగ్గరికి తీసి కెళ్ళాడు.

"ఇలాంటిది ఏదో సినిమాలో చూశాను నేను" అంది ఇందిర ఏతం చూస్తూనే.

"దీనికి ఎడ్లని ఉపయోగించరు. అదిగో, కొయ్య మీదికి మనిషే ఎక్కి కాస్త వెనక్కి వస్తూంటాడు. ఒడ్డు దగ్గరికి వచ్చిన నీటిని డ్రొప్పల్ని మరో మనిషి అందుకుని పక్క బోదిలోకి పోస్తాడు. పని చేసేటప్పుడు చూస్తే బావుం టుంది ఇందిరా! ఈ వర్షాకాలంలో నీ రెవరి కావాలి?" అన్నాడు కృష్ణ.

"దిగుడు బావంటే అదేలా ఉంటుంది?" అంది ఇందిర.

"బలే దానివే నువ్వు. తులసి కబుర్లట్టుకు నా ప్రాణాలు తోడేస్తున్నావు, మోట తోడినట్టు. అసలీ వూళ్ళో దిగుడు బావులే లేవు. నువ్వెక్కడ చూశావ్ తులసీ."

"మా నాన్నగారి ఊళ్లో చూశాను. నువ్వూ చూశావా అని అడిగాను గానీ ఇక్కడున్నాయనా ఏమిటి ?" అంది తులసి మాతి మూడువంకర్లు తిప్పి.

"దిగుడు బావంటే ఏం లేదు ఇందిరా ! లోపలికి దిగటానికి ఒడు వెంటే గుండ్రంగా నీళ్ళదాకా మెట్లుంటాయి. సుజాత వాళ్ళ నత్తగుల్ల మేడ మెట్లెక్కటం నీ కలవాటే కదూ ? అదే మాదిరి. కాని చాలా ధైర్యం కలవాళ్ళు తప్ప దిగలేరు. ఇహ పోదాం పదండి మన తోటకి."

ఇందిరకి సుజాత గుర్తొచ్చింది. 'ఆ పల్లెటూళ్ళో ఏం చూస్తావ్ ఇందూ ? హాయిగా హైద్రాబాద్ ఎక్స్కర్షన్ వెళదాం' అంది తనభిప్రాయం వినగానే 'అవునులే. ఎంతైనా అత్తవారి ఊరు. చూసిరా' అంటూ హాస్యం చేసింది, తన పట్టు మార్చుకోనందుకు. కానీ వెళ్ళాక సుజాతకి తను చూసినవన్నీ చెప్తే ఏమంటుందీ? పూస గుచ్చినట్టు చెప్పాలి. "ఏమిటి ? మాటా మంచీ లేకుండా తెగ ఆలోచించేస్తున్నారిద్దరూ !" అన్నాడు కృష్ణమోహన్—"సుజాత గుర్తొచ్చింది" అంది ఇందిర.

"మరి నీకు ?"

"మా నాన్న జ్ఞాపకాని కొస్తున్నాడు" నవ్వింది తులసి.

"ఓహో ! ఇలా ఊహల్లో కొట్టుకుపోతే చాలా చిక్కు. చెర్లో ఒక్క మునుగు మునిగితే కావలసినంత హుషార్" అన్నాడు ఉషాయుగా కృష్ణమోహన్.

"అన్నట్టు మనం కొబ్బరి మడి చూపించనే లేదు ఇందిరకి. ఐతే కాస్సేపిక్కడ కూర్చుందాం" అంది తులసి. ముగ్గురూ మెత్తటి పచ్చగడ్డిమీద కూర్చున్నారు. చెట్లు దూర దూరంగా చాలా ఎత్తుగా ఉన్నాయి. సన్నని కొబ్బ రాకులు గాలికి ఊగుతున్నాయి. చాలా చెట్లకి గెలలు వేలాడుతున్నాయి.

"అప్పన్న వుంటే కొబ్బరి బొండాలు దింపును. ఈసారి వాణ్ణి తీసుకొద్దాం" అంది తులసి.

"కొబ్బరితోట తిరిగాక చెర్లో ఆట! ఉయ్యాళ్ళు ఊగటం! కిందకున్న మామిడి చెట్లెక్కటం!"

"మాట్లాడ్డానికే సిగ్గుపడే ఇందిరకి అల్లరెలా పట్టు బడిందీ?" అనుకున్నాడు కృష్ణమోహన్.

"దాగుడుమూత లాడుకుందాం. ఈ చెట్టు తల్లి. నేను దొంగని. మీరు పరిగెత్తండి" అంది తులసి సంతోషంగా.

"నాకు పరిగెత్తటం రాదు బాబూ! తొందరగా దొంగైపోతాను. నా కెవరూ దొరకరు" అంది ఇందిర.

"నే దొరికిపోతాలే. పల్లెటూర్లో పది రోజులుండి పరిగెత్తటం నేర్చుకోపోతే షేమ్ కదూ! మరి పరిగెత్తు. తులసి వచ్చేస్తోంది" ఇందిర చెయ్యి పట్టుకు పరుగెత్తాడు కృష్ణమోహన్. చాలాసేపు తులసి మావయ్యనే కవ్వించింది. ఎంతకీ దొరక్కపోతే ఇందిరని అంటేసుకుంది. 'ఇందిర

దొంగ్గైంది. కృష్ణమోహన్ వెనక పరుగెత్తింది. రెండు నిమిషాలు అందకుండా తిరిగి ఎక్కడ ఆటమానేస్తుందో నని భయమేసి దొరికిపోయాడు. "అదేమిటీ? నాకంటె బాగా పరిగెత్తిందా ఇందిర? కావాలని దొరికిపోతే నేననస లాడను" అంటూ వెళ్ళి కింద చతికిలబడింది తులసి కోపంగా. దాన్ని బ్రతిమాలి ఆటలోకి తీసికొచ్చేసరికి పెద్దలు దిగొచ్చారు. కృష్ణ ఇందిరని కాస్సేపు కవ్వించి వదిలేసి తులసిని తరిమి తరిమి పట్టుకున్నాడు.

"ఇక చాలు బాబూ ఆట!" వగురుస్తూ అంది తులసి.

"అబ్బా! ఎంతపరుగు తీసింది! చచ్చాను పట్టుకో టానికి. అప్పటికైనా జడ దొరక్కపోతే_" కృష్ణ మోహన్ అలుపుగా చతికిల బడ్డాడు గడ్డిలో. ఇందిర దర్జాగా కూర్చుంది కొమ్మెక్కి.

♦ ♦ ♦

వారం దాటింది. రెండు రోజులు క్రిందట ఇంటికో కార్డు రాసింది ఇందిర, నాలుగు రోజుల్లో వస్తానని. కాని పల్లె వాతావరణం పట్నాన్ని మరిపిస్తున్నది. సహజమైన ప్రకృతిశోభ చూస్తున్నకొద్దీ పట్నంలో పార్కులూ, బీచీలు, కృత్రిమంగా తోస్తున్నాయి. తల్లి ప్రేమని మరపించే అన్న పూర్ణమ్మ ఆదరణ! కొన్ని హద్దుల్లో స్నేహం చేసే కాలేజీ స్నేహితుల్ని తోసిరాజనే తులసి అమాయకమైన స్నేహం;

తనే సర్వస్వంగా ప్రేమించి మురిసే కృష్ణమోహన్ అనురాగం; నోటి నుంచి మాట రాకుండానే సంతోషంగా ఆప్యాయంగా ప్రవర్తించే అప్పన్న దాస్యం!— అన్నీ ఇందిరకి తన్మయత కలిగించాయి. చాలా చీకటితో కోడి కూత వింటూనే లేవటం సర్దాగానే వుంది. ఆ మసక చీకటిలోనే వీధులన్నీ సందడిగా వుంటాయి. వంటపాకలో కూర్చుంటే అన్న పూర్ణమ్మ బస్తీ కబుర్లూ, తమ ఇంటి సమాచారాలూ అడుగుతుంది, చనువుగా. స్నానం: అయ్యేసరికి రెండు పూల దండలు తయారు చేస్తుంది తులసి. పది దాటితే కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు! మధ్యాహ్నం ఏదో ఆట లేదా చావిట్లో పిచ్చాపాటీ! సాయంత్రం తాళ్ళ తోపులో, మామిడితోటలో షికారు. ప్రోగ్రాం ఇందిరే సెలెక్ట్ చేస్తుంది. దీపాలు పెట్టేవరకూ దాగుడుమూతలో వుయ్యా లూగటమో చెర్లో ఆటో ఏదో ఒకటి! రోజులు క్షణాల్లా దాటిపోయాయి.

"లాస్టియర్ కూడా! ఇంటి కెళ్ళి ఏమైనా పుస్తకాల బూజు దులుపుకోటం వుందా; ఏకంగా కాపురం వుండి పోతావా!" వూగే వుయ్యాల ఆపుచేసి తాళ్ళుపట్టుకుని అడిగాడు కృష్ణమోహన్.

"వెళ్ళను. వెళ్ళాలని లేదు" నవ్వింది ఇందిర.

"ఒక్క— ఐదారు నెలలు కళ్ళు మూసుకో ఇందూ! తర్వాత పెద్ద ఉయ్యాల వేయించుకు జంటగా ఊగుదాం."

"సరేలే! విడు— తులసి వస్తుంది."

"వస్తే వస్తుందిలే. ఎన్నాళ్లీ దాగుడు మూతలు? ఏనాటికైనా తెలియాల్సిందే!"

తులసి అప్పన్నతో కొబ్బరి బొండాలు దింపించు కొచ్చింది. నలుగురూ లేత కొబ్బరి తింటూ కూర్చున్నారు. తులసి ఆవాడు ఇందిర కోరికమీద చీర కట్టుకుంది. హుందాగా వుంది.

"తులసి చీరలోనే బావుంది నాకు" అన్నాడు కృష్ణ మోహన్ పరకాయించి చూస్తూ.

తులసి సిగ్గుపడింది — "మావయ్య నన్నే చూస్తూ వుంటాడు కాబోలు!" అనుకుంది. ఐనా పై మాటగా "ఇందిర కంటేనా?" అంది. కృష్ణమోహన్ ఇందిర కేసి చూశాడు.

"తులసి ఎర్రగా దృఢంగా వుంటుంది. ఇందిర తెల్లగా సన్నగా వుంటుంది. అందుకని తులసి నిగనిగలాడే ముదురాకు! ఇందిర నవనవలాడే లేచిగురు! అవును కదూ అప్పన్నా?" అన్నాడు కృష్ణమోహన్ అప్పన్నని మధ్య వర్తిగా పెట్టుకుని.

"మీ మాట లేమిటో నాకు బోధపడలేదండి అబ్బాయి గారు!" అప్పన్న నవ్వాడు.

"పోనీ మీ అబ్బాయిగా రెలా వుంటారో చెప్పు అప్పన్నా!" అంది ఇందిర నవ్వుతూ.

"మా అబ్బాయి కేమండీ రాజా! అబ్బాయిగారి భార్య చాలా అదృష్ట వంతురాలు" తులసి దూరంగా

చూస్తూ కూర్చుంది ఎవరికేసీ చూడలేక. ఇందిర నవ్వింది నాజూగ్గా!

ఆ రాత్రి భోజనాల తదనంతరం పడుకోడానికి పైకి వచ్చిన తులసి మంచినీళ్ళు తేవటం మర్చిపోవటంవల్ల కింద కెళ్ళింది; ఆ వెళ్ళిన వెళ్ళటం ఎంతసేపు ఎదురు చూచినా రాలేదు. గంటా గంటన్నరా కూడా గడిచిపోయింది. ఇందిరకి నిద్రపట్టటం లేదు. తులసికోసం రాబోతూంటే తులసి ఎదురు పడింది విసురుగా.

"ఏమిటే? వెళ్ళి వెళ్ళినట్లే వుండిపోయావ్?" అంది ఇందిర వెనక్కొస్తూ. తులసి మాట్లాడలేదు. మౌనంగా వచ్చి మంచంమీద అటు తిరిగి పడుకుంది. ఇందిర కేమీ అర్థం కాలేదు.

"ఏమిటే తులసీ? ఎవ రేమన్నారు?" అడిగింది.

"ఎవరే మంటారూ? అంటే ఏం ఊరుకోరు" ఛళ్ళుమని జవాబు చెప్పింది. ఇందిర తెల్లబోయింది. ఈ పది రోజుల్లో ఎప్పుడైనా తులసి ఇంత నిరసనగా మాట్లాడిందా?

"ఐతే నీకు కోపం దేని కొచ్చిందీ?"

"నా కేం కోపం లేదు; తాపం లేదు. నాలాంటి దానికి కోపం వచ్చి ఏం లాభం?"

"ఏమిటి తులసీ? చిత్రంగా మాట్లాడుతున్నావ్! నే నేం చేశాననీ?"

తులసి మాట్లాడలేదు. ఇందిర తులసి మంచంమీద కూర్చుని అంది— "నీ కెందుకో నామీద కోపం వచ్చింది

తులసీ! నే నేం పొరపాటు చేసినట్టు గుర్తులేదు. ఒకవేళ ఏదైనా జరిగితే ఏమీ అనుకోకు తులసీ! ఇన్నాళ్ళు కలిసీ మెలిసీవుండి తీరా వెళ్ళిపోయేటప్పుడు..."

"పిచ్చిదాన్ని కాబట్టి కలిసీ మెలిసీ వున్నాను. ఎంతైనా బస్తీదానివిలే."

ఇందిరకు కాస్త కోపం వచ్చింది— "నే చేసిన పొరపాటేమిటో సూటిగా చెప్పి చీవాట్లెట్టు. అంతేగానీ నువ్వెంత గొప్పదానివైనా వూరికే మాట లనకు" ఇందిర తులసి మంచంమీదనుంచి లేచి కిటికీకి జేరగిలబడి నించుంది.

"నిన్ను చీవాట్లెయ్యడానికి నే నెవర్ని? ఇంటికి అధికారిణివి."

"ఎవరు చెప్పారు?"

"మావయ్య అమ్మతో చెప్తున్నాడు. మీరు స్నేహితులే అనుకున్నాను. ప్రేమికులు కూడానా?" వెటకారంగా అంది తులసి లేచి కూర్చుని. ఇందిర గుండెలో బండ పడింది. ఐనా ధైర్యం చేసుకుని— "ఐతే నీకు కోపం దేనికీ మధ్య!" అంది కిటికీలోంచి బయటికి చూస్తూ.

తులసి విస్తుబోయింది— "నాకు గాకపోతే ఎవరి కొస్తుంది కోపం! మావయ్యకీ నాకూ పెళ్ళవుతుందని తెలుసా!..."ఇందిర వులిక్కిపడి చిత్రంగా చూసింది తులసి మొహంలోకి.

"ఎందు కలా చూస్తావ్? మా అమ్మ చచ్చిపోయిన క్షణంనుంచీ మా అమ్మమ్మ అదే ఉద్దేశంతో దగ్గరికి తీసింది.

పెళ్ళంటూ జరగలేదుగానీ మావయ్య పెళ్ళాంగానే చెలామణి అవుతున్నాను. ఇంతవరకూ మావయ్య కూడా అడ్డు చెప్పలేదు. మరి నిన్ను చూసి మోజుపడ్డా డేమో తెలీదు. "మా ఇద్దరి మధ్య నువ్వేలా రావాలనుకున్నావ్?"

ఇందిర పరిస్థితి ఘోరంగా వుంది. తన చెవులని తను నమ్మలేకపోయింది. కలవరపాటు కనపడనీయకుండా నెమ్మదిగా అంది— "నాకీ సంగతేమీ తెలియదు తులసీ! అసలు మొదట్లో కృష్ణమోహన్‌కి మేనగోడ లంటూ ఒకమ్మాయి వుందనుకోలేదు. స్నేహం చాలా దృఢపడ్డాక గానీ ఒకరి కుటుంబ వ్యవహారా లొకళ్ళం తెలుసుకోలేదు. నీ గురించి చెప్పాడే గాని ఇలా మీ పెళ్ళి విషయం మాట మాత్రం కూడా అన్లేదు. ఆదిలో తెలిస్తే ఈ విషయం ఇంతవరకూ వచ్చేది కాదు."

"ఇప్పు డేం మించిపోలేదు. ఇప్పుడు తెలిసిందిగా!" ముసుగు తన్నిపెట్టి పడుకుంది తులసి. ఇందిర కాసేపు నుంచుని లైటు తగ్గించి పడుకుంది. బుర్ర ఆలోచనల్తో నిండి పోయింది. ఇంత దగాచేసిన కృష్ణమోహన్ని ఆ చెంపా ఈ చెంపా వాయించి తల వాచేలా చీవాట్లు పెట్టాలనిపించింది. ఒకవేళ కృష్ణమోహన్‌కి నిజంగా తులసంటే ఇష్టంలేదేమో..! ఏది ఏమైనా కృష్ణమోహన్‌తో ఖచ్చితంగా మాట్లాడి రేపు వెళ్ళిపోవా లనుకుంది. ఎంత ప్రయత్నించినా నిద్రపట్టటం లేదు. తులసి కూడా కదులుతూనే వుంది. దాదాపు ఇందిర ఆ రాత్రి జాగారం చేసింది. తెల్లవారుజాము నెప్పుడో



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA103B162 |
| పుస్తకం పేరు | ఆండాళ్ళమ్మగారు |
| తారీఖు | 25-10-2024 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 161 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1to4 |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | thasin |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | thasin |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |